తారకామృత

# పరమహంస

# ప్రబోధిని

రచన

దయానంద రాజయోగి

ఓం

—(శ్రీ గురుభ్యో నమః)—

తారకామృత

# పరమహంస ప్రబోధిని

## రాజయోగీయము


గ్రంథకర్త

చలఋషి

నంద రాజయోగి





శ్రీ దత్తాముద్రాక్షరశాల, సెకండుబజార్,

సికిందాబాదు—ఆంధ్రప్రదేశ్.

1960

Acc. No: 14935

ఓం

—( శ్రీ గురుభ్యో నమః )—

తారకామృత

# పరమహంస ప్రబోధిని

రాజయోగియ...

గ్రంథకర్త

శ్రీ శివరామదీక్షిత అచలగురు పీఠాధిపతి

అచల ఋషి

శ్రీ దయానంద రాజయోగి

ప్రథమ ముద్రణము: [ 1000 ] ప్రతులు



శ్రీ దత్తాముద్రాక్షరశాల, సెకండుబజార్,

సికింద్రాబాదు—ఆంధ్రప్రదేశ్.

రిజిష్టర్డు కాపీరైట్ 1960 వెల 1-8-0

—( ఓం )—

శ్రీ గు రు భ్యో న్న మః

# అనుష్టానవిధిః

## గురుపరంపరాధ్యానం

శ్లో॥ పరిపూర్ణబోధ సిద్ధాంత । బ్రహ్మావిద్యోప దేశిక ।
శ్రీమన్నారాయణం సూర్యం । సద్గురుభ్యోనమోనమః ॥

శ్లో॥ యాజ్ఞవల్క్యంచ జనకం । శుకసాందీప మీశ్వరమ్ ।
కృష్ణ మర్జున సంయుక్తం । ఉద్ధవంచ నమోనమః ॥

శ్లో॥ అంబికా శివయోగీశం । వేమనా యోగి సద్గురుం ।
నిరంజన వెంకటార్యం । తిరువెంగళ గురుంభజే ॥

శ్లో॥ శ్రీధరస్వామి యోగీంద్రం । శివరామాఖ్య దీక్షితం ।
కంబాలూరి అప్పబ్రహ్మం । సద్గురుభ్యోనమోనమః

శ్లో॥ పరశురామ సీతారామ । భాగవత కృష్ణయోగినః
పీలుఖాన లక్ష్మణార్య । సద్గురుభ్యో నమోనమః

శ్లో॥ బృహద్వాసిష్ట సిద్ధాంత । పూర్ణబోధోపదేశిక ।
వేంకటేశ్వర యోగీంద్ర । సద్గురుభ్యో నమోనమః

శ్లో॥ వేంకటేశ్వర పాదార । విందామృత రసాయనం ।
పిబన్మత్త మనోభృంగం । హనుమంతం గురుంభజే ।

శ్లో॥ వేదశాస్త్ర విధిఖ్యాతం । పూర్ణబోధో పదేశికం॥
సుగుణాకర దయానందం । రాజయోగి గురుంభజే॥

శ్లో॥ అస్మద్గురు సమారంభాం । కృష్ణసాందీప మధ్యమామ్।
పరిపూర్ణబోధ సిద్ధాంతం । వందేగురు పరంపరామ్॥

శ్రీగురుభ్యో నమః

# పీఠిక

పొన్నాల వంశకలశాంబుధి పూర్ణచంద్రం
పూర్ణం దయానిధి మనంత గుణైకధిష్ణ్యమ్ .
రాజాధిరాజమకుటాంచిత రత్నసేవ్యం
శ్రీరాజయోగి గురుమంతరతో నమామి-

జీవనిచయములో వెన్నెత్తి తిరుగాడు వాడు మానవుడు. అతడు జీవకోటి కంతటి కంటె తెలివిగలవాడు; ఎందుచేత ననగా వెన్నును నిట్టనిలువుగా నుంచి తిరుగాడు నప్పుడు సుషుమ్నానాళ మూర్ధ్వదృష్టి గలదియై యుండును. అప్పుడు మనఃప్రాణములు, దన్ను, ననుసరించి, వ్యాపకములై యుండును. అందుచే జ్ఞానము స్థాయిజెందును. స్థావర రూపములగు తరులతాదులకు చలనత్వము లేదు. పరావాగ్రూపమున వానికి అంతఃకరణము మాత్రముగలదు. చలనముగల ప్రాణులలో స్వేదజములకు పరాపశ్యంతి వాక్కులు గలవు వెన్నెముక వానికిలేదు. సుషుమ్నానాళము మాత్రము సూక్ష్మాతి సూక్ష్మముగా అదృశ్య రూపమున వానియందు నాతి విస్తృతితో నుండును. వానికి జ్ఞానము కేవలమందము. అండజములకును జలచరములకును జరాయుజములలో పశుమృగాదులకును పరాపశ్యంతి మధ్యమావాక్కులు గలవు. అందువలన నవి మానవుని సాంజ్ఞల గ్రహించి తదనుసరణ మొనర్చు చున్నవి. ఒకప్పుడు పశు

పక్షులును వైఖరీవాక్కు గలిగియుండి అగ్నిశాపముచే నద్దాని గోల్పోయినట్లు పురాణ ప్రసిద్ధి. వీని వెన్నెముక తిర్యగ్రూపముగా నుండుటచే మానవ వాక్కుల ననుకరించుచున్నవే గాని మానవునకు సమాధాన మీయగల శక్తిగలవిగా లేకున్నవి. ఇంతకు జరాయుజములలో వైఖరీ వాక్కుగల మానవుడు భూమిపై నిలువున నిలబడి తిరుగాడుటకు ననువుగా వెన్నెముక సమకూర్చ బడియున్నాడు. అందుచేతనే అతడు సర్వము గుర్తెరుగుచున్నాడు. ఇతరులకు గల్గు శంకల దీర్చగల సమాధానమీయ గల్గుచున్నాడు. తన వివేక పటిమతో దైవత్వము నొందుచున్నాడు. ఈనాడతడు చేయని పనిలేదు. యంత్రసహాయముతో దూరదృష్టి దూరశ్రవణము దూరగమనము చేయుచున్నాడు. ఇవి యన్నియు ముని మొదట తానే యంత్రసహాయము లేకయే ఆత్మశక్తితో యోగబలముతో సాధించుకొన్నాడు. ఊర్ధ్వలోకముల నేడింటిని గ్రహమండలముల నన్నిటిని చేరుకొని దేవతలతో దేవయోని సంభూతులతో గలిసి మెలసి తిరుగాడుచు ముచ్చటింప సాగినాడు.

ఇట్లు లోకోత్తరశక్తుల సాధించుకొనగల్గు సాధనా ప్రహేళిక మానవునకు నీపరమహంస ప్రబోధిని యందు లభించ గలదు.

దీనిని రచించినవారు అచలాధిప దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారు వీరు తెలంగానములోని సికింద్రాబాదు వాస్తవ్యులు. తెలుగునందు వేమనోపజ్ఞమగు అచల

వేదాంతము గద్యపద్యములుగా శ్రీరామునకు శివరామ దీక్షి
తులును భాగవతుల కృష్ణదేశికులును విపులముగా వివరించి
యున్నారు. అవ్వాని నాధార మొనర్చుకొని శ్రీరాజయోగి
గారు నిజప్రబోధ విధానమను పేర అచల పరిపూర్ణ రాజ
యోగీయము రచించి సర్వవేదాంత సిద్ధాంత సముల్లాసమును
విస్తరించి యున్నారు. అందు సర్వయోగ సాధనాసముచ్చ
యము సంగ్రహముగా జెప్పబడియున్నది. విషయము నాటి
విస్తృత మగుటచే సాధకుల కద్దానివలన సంపూర్ణ ప్రయోజ
నము చేకురినదికాదు. అట్టి కొఱత దీర్చుటకై యిద్దాని రచన
మరల శ్రీవారిచే గావింపవలసి వచ్చినది. మహాత్ములకు లోక
సంగ్రహమే పరమ ప్రయోజనముగదా?

అచల పరిపూర్ణయోగులు "సాధనా ప్రవృత్తి శూన్య
మగు అచల బోధ సర్వోత్కృష్టము. దీనిని బొందిన మాత్రము
చేతనే మానవుడు జనన మరణ ప్రవాహము నుండి తరింప
గల్గుచున్నాడు" అని నుడివి నప్పుడు "కేవల సాధనా సముల్ల
సితమగు నీగ్రంధము—అచలాధిపతులగు రాజయోగీంద్రులు
రచించుటలో ప్రయోజనమేమి?" అనుశంక చదువరులకు
గల్గక మానదు.

బహుజన్మ సుకృత విశేషవశమున మానవుడు విజ్ఞాన
వంతుడగుచున్నాడు. అట్టి వివేకిపరిపూర్ణబోధనెఱుగ యత్నించి
గురువులనెఱికి వారి పజ్జజేరి నిజబోధ నాలకించుకొని అద్దా
నిచే తనకు బోధస్థితి గుదిరి పరిపూర్ణ—స్థితి పురుషత్వము—అబ్బు
చున్నది. ప్రాక్తనవాసనాఘటిమచే కొందఱికది అవగతము

గావచ్చును, కాకపోవచ్చును; తెలిసీ తెలియని మధ్యస్థితికి దేవచ్చును. కాని సంపూర్ణ ప్రతిభాశాలి నివురుగప్పిన నిప్పు వలెరుండును. భ్రాంతి యను నుసి ఊది పోగొట్టి జ్ఞానాగ్నిని ప్రజ్వలింప జేయదగినవారు సద్గురువులు. సద్గురుకృపచే నిజబోధామృతము గ్రోలినవానికి ఇతర సాధనల యావస్యకతయుండదు. కాని తాను పరిపూర్ణుడు గనుక సర్వసాధనల స్వరూపముల నెఱిగి తుదకు విడుచును.

ఇక నీచస్థితిలోనివానికి ఏసాధనయు ఎట్టిబోధయు కాబట్టదు. మధ్యమస్థాయిలోనివానికి అంతసులువుగా పరిపూర్ణస్థితి లభింపదు. ఆతని రుచిభేదమును బట్టి నిజగురువతనికి తనువగు సాధనల బోధించి తద్వార పరిపూర్ణ సాధమునకు సోపానపు తెన్నుల జూపించి గమ్యస్థానము చేర్చుచున్నాడు కనుకనే శ్రీ భాగవతుల కృష్ణదేశికులు "సాధన సంపత్తియు గల సాధకుడొక నరుడు" అని గురుశిష్యోభయ లక్షణమున మొదటనే బోధార్హుడగు సాధకునిగూర్చి యుగ్గడించి యున్నాడు. "చక్కని బోధాగ్నివలన సాధించుకోరా! అనియును, "అపరిపూర్ణమగు బట్టబయ లెల్లకడలందు నిబిడీకృతంబయి నిలిచియుండు, దవిరి దీనిని సాధించు దీక్షనీవు " అనియును సాధన చరమస్థితిని శ్రీవారు బోధించియున్నారు. ఇంతకు దీనిని బట్టి మందాధికారికి సాధన అవసరమని తేలుచున్నది. అందుచే మజల నీగ్రంధరచనకు ఆవస్యకత శ్రీ రాజయోగీంద్రులకు గలిగినది.

బాహ్యసాధనలు— ఆంతరంగిక సాధనలని సాధనలు

రెండువిధములు. యజ్ఞయాగ తపోదానాదులు బాహ్యసాధనలు. వివేక విరాగశమాది షట్కము ముముక్షుత్వం తత్వం పదార్థశోధనాదులు—ఆంతరంగిక సాధనలు.

ఈ పరమహంస ప్రబోధిని సారాంశము తత్వం పదార్థ సంశోధనా సముల్లసితము. తారక సాంఖ్య మనస్క రాజయోగ పరిపూర్ణ రాజయోగము లేనిటిలో తారకయోగము మొదటిది. అందు సుషుమ్నయొక్క బాహ్యాభ్యంతర భేదములముందు నెఱుగవలెను. పిమ్మట షట్చక్ర స్వరూపమును అటసట జరుగుచున్న హంస సమర్పణయు తెలియవలెను. అష్టదళ పద్మమధ్యమున చరించుచున్న ఆత్మస్థితియు ఆత్మ పరమాత్మతో నైక్యమగు విధానమెరిగి హంసోత్పత్తిస్థానమును దాని వ్యాపక వ్యాపారములను గమనింపవలెను. గంటికా నాదముతో నున్ననాడుల ముడిగుర్తించి హంసజపము గావించుచు రామ మంత్ర ప్రభావమెఱుగవలెను. హంస అష్టదళ పద్మమున నివసించుటకు కారణమును ఆయా దళములలో వసించునప్పుడు దానికి గల్గు నామభేదములను తనకు అహమర్థాభిధానమెట్లు కల్గినదియు తెలిసికొని ప్రాణవాయువునకు బాహ్యాంతర సాంజ్ఞ లేర్పడిన విషయమరసి బాహ్యాంతర సుషుమ్నల నడి దెసగల చక్రముల గమనించి పంచమద్రి స్థానము, జ్ఞాన సంబంధావస్థ శరీరము, నకాధిష్ఠాన దేవతలకు హంసార్పణయు తద్విహీన తత్సృష్టి క్రియముల నవగతము చేసుకొనవలెను. విరాడ్రూప లక్ష్యముతో పరమేశ్వర హంసల దెలసికొని దానికిగల్గిన గుణకల్పనల గ్రహించవలెను.

అష్టతనువులనెఱిగి జీవేశ్వర కృత్యముల గుఱ్ఱించి తత్కార్మ సంవిధాన విధానముల ననుసంధానమొనర్పవలెను. ద్వాద శాంశములను జీవేశ్వర ప్రణవపాదముల గోచరము చేసికొని ఆప్రణవమునకు గలషోడశ కళల నాకలించుకొనవలెను. ప్రణవము యొక్క పరిణామ స్వరూపమెఱిగి ప్రకృతి పురుష స్వరూపములను క్రియాది పంచశక్తులను బ్రహ్మాదిపంచకర్తలను గుర్తించి ప్రణవమునకు శబ్దాత్మకత్వ మెట్లుగల్గినది తెలియవలెను. హృదయమునందలి ప్రాణవాయువునకును గంటికయందలి ప్రణవమునకును, గలసంబంధమును గ్రహింపవలెను. జీవన్ముక్తి విధానముతత్సాధనా ప్రణాలికయు. గోచరింపు జేసికొని యభ్యసింపవలెను. ఇట్టి శతాధికాంశములతో ప్రశ్నోత్తరరూపమున నీగ్రంధరాజ మలరారుచున్నది. దీనిని సమీక్షించి పీఠిక వ్రాయదలచిన మఱియొక గ్రంధమగును. ఐనను నాయనుభూతి నీప్రబోధినికి–అనుబంధముగా శ్రీసద్గురు పాదపద్మములకు నామానస కుసుమసమర్పణతో బాటు నీ విమర్శనా సౌగంధికమును సంవాసితమొనర్చి నాకృతి సుకృతి యొనర్చుకొందును.

· బహుజన్మ కృతపాపశైలములకు ధ్యానయోగము శతధారవంటిది. పాపనిర్మూలనమునకు దీనికి మించినమఱియొక సాధన గానరాదు. బీజమునకు పరముగాబిందువున్నది. బిందువునకుపరముగా నాదమున్నది. శబ్దాత్మక వర్ణాత్మకమగు బీజము సద్గురుకృపచే నశించును. అంతట నిశ్శబ్దబ్రహ్మము నిల్చును. అనాహత శబ్దమునకు బ్రహ్మముపరము. దీని నెఱింగినవాడే

పరమయోగి, ఒక వెంట్రుకను నూరువేలచీలికెలుగా చీల్చిన అది మిగలని విధముగా తత్వశోధనచే నీశబ్దము నశించుచున్నది. అప్పుడు నిరంజన బహ్మముమాత్రమే శేషించును. పుష్పములోని గంధమువలెను, పాలలోని నెయ్యివలెను, నువ్వులలోని నూనెవలెను, పాషాణములోని బంగారమువలెను, మణిలోని దారమువలెను, సర్వభూతములందు-ఆత్మయున్నది. స్థిరబుద్ధిగల బ్రహ్మవేత్త నిజబోధచే ఆత్మస్వరూపమగు బ్రహ్మము నెఱుగుచున్నాడు. సంసారవృక్షము సకలము గుర్తించుచున్నది. నీడదానికి నిష్కళ. అంతయు నిష్కళా భావమే.

## ప్రణవము

ఓం, అను నేకాక్షర బ్రహ్మమేప్రణవము. ముముక్షువులందరిచే నయ్యది ధ్యానింపబడుచున్నది. దీనియందు-అకారము-ఉకారము-మకారము-అర్ధమాత్రియు గలవు. అకారమునకు బహ్మయు, భూమియు, అగ్నియు, ఋగ్వేదముభూః అను వ్యాహృతియు గలవు. ప్రణవాంశమగు నీ అకారమందు లయప్రాప్తిగల్గుచున్నది. ఇది ప్రణవమునకు మొదటి భాగము.

ఉకారమునకు విష్ణువు- అంతరిక్షము, వాయువు, యజుర్వేదము, భువఃఅను వ్యాహృతియు గలవు: ప్రణవాంశమగు నీ ఉకారమందు లయప్రాప్తి గల్గు చున్నది. ఇది ప్రణవమునకు రెండవ భాగము.

మకారమునకు మహేశ్వరుడు, ఆకాశము, సూర్యుడు, సామవేదము, సువః అను వ్యాహృతియు గలవు. ప్రణవాంశమగు మకారమందు లయప్రాప్తిగల్గుచున్నది. ఇది ప్రణవమునకు మూడవ భాగము.

అకారము పచ్చని రంగు-రజోగుణము. ఉకారము తెల్లని రంగు- సత్వగుణము. మకారము కృష్ణవర్ణము-తమోగుణము-

అర్థమాత్ర వర్ణాతీత గుణాతీతము కావున దానికెట్టి ప్రసక్తియు లేదు.

ఎనిమిది అంగములు నాల్గు పాదములు మూడుస్థానములు ఐదు దైవతములు వీనితోగూడి ఓంకారమున్నది. ఈ ఓంకారము తెలియనివాడు బ్రాహ్మణుడుగాడు. ప్రణవము ధనస్సుగను, ఆత్మ బాణముగను బ్రహ్మము దాని లక్ష్యముగను జెప్పబడుచున్నది. ఇట్లు దీనిని అప్రమత్తతతో దెలియవలెను బాణమువలె తన్మయుడు గావలెను. అప్పుడు పరమాత్మకమగు దీని దృష్టియందు సర్వక్రియలు నశించుచున్నవి. సచరాచరాత్మకములగు మూడులోకములు ఓంకారమునుండియే కల్గినవి. హ్రస్వము పాపముల దహించును. దీర్ఘము-అవ్యయము నొసగును. అర్థమాత్ర యుక్తమగు ఓంకారము మోక్షదాయకము. ఎడతెరిపిలేని తైలధారవలెను దీర్ఘఘంటానినాదము వలెను ప్రణవమునుచ్చరించవలెను ఈ విధాన

మెఱిగినవాడే వేదవిదుడు. హృత్పద్మ కర్ణికా మధ్యమున కదలికలేని దీపమువలె ప్రకాశించుచు అంగుష్ఠ ప్రమాణముతో ఆత్మయున్నది. దానిని ఓంకారముతో ధ్యానింపవలెను ఇడా నాడితో వాయువును లాగి పింగళతో వదలుచు సుషుమ్నతో కుంభించవలెను. పూరకమునకు బ్రహ్మయు కుంభకమునకు విష్ణువు రేచకమునకు రుద్రుడు—అధిదేవతలు. ఆత్మను అరణిగను ప్రణవమును ఉత్తరారణిగను జేసి ధ్యానయోగముతో మథించిన నిగూఢమగు దేవుడు గనుపించును. ఓంకారధ్వని నాదముతో వాయు నిరోధమగుచున్నది. గమనాగమనము లందుండి రవికోటి దీప్తితో నీఓంకార మొప్పుచున్నది. హంసాత్మకమగు దీని నెఱిగినవారే విరజాస్వరూపులు. ఏమనస్సు సృష్టి స్థితి లయము లొనర్చుచున్నదో అ మనస్సు నశింపజేయుటయే పరమపదము.

## -[ హృదయ పద్మము ]-

హృదయ పద్మమునకు— ఎనిమిది దళములు పండ్రెండు కేసరములు గలవు. దాని మధ్య భాగమందు సూర్యుడున్నాడు. అతని మధ్యమున చంద్రుడు గలడు. ఆతని నడుమ అగ్నియున్నది. దానిమధ్య తేజోమండలమున్నది. అద్దాని నడమ రత్నఖచితసింహాసనము గలదు. శ్రీమహావిష్ణువు దానిపై కూర్చొని యున్నాడు. అట్టి విష్ణువును నాభిస్థానమున ప్రతిష్ఠత మొనర్చి పూరకముతో ధ్యానింప వలెను. భారతీ నాథుడగు బ్రహ్మను హృదయ స్థానమున జేర్చికుంభకముతో

ధ్యానింపవలెను. త్రిలోచనుడగు రుద్రుని లలాట స్థానమున జేర్చి రేచకముతో ధ్యానింపవలెను.

హృదయ పద్మమునకు ముఖము క్రిందుగను దాని నాళము మీదుగను నున్నది. శివస్వరూపమగు నీకమలము వేదమయమై నూరు అంతఃకోణములు గలిగి కదళీ పుష్పము వలె ప్రకాశించుచున్నది. దీనికర్ణిక చుట్టునూరు అంతర్దళములు-ఒకదానిపై నొకటి కప్పుకొని యున్నవి. అగ్ని చంద్ర సూర్యాగ్నులకీ దళములు ఒకటిపై నొకటి మూయబడియున్నవి. పద్మము యొక్క ఉద్ఘాటన మొనర్చి సూర్య చంద్రాగ్ని కాంతులతో గూడికొని యున్న దానినుండి హ్రీంకారము లాగికొని ఆత్మను స్థిరముగా నుంచుకొనవలెను. మూడవ స్థానమును, మూడవ సూత్రమును, మూడవ బ్రహ్మను, మూడవ యక్షరమును మూడవ మాత్రను గుర్తించవలెను. ఇక యన్నియు నర్థ మాత్రమున ఇమిడి యున్నవి. దీని నెఱిగిన వాడే వేదవిదుడు. తైలధార వలె నెడతెరిపిలేక నాదబిందు కళాతీత మగు నోంకారము మ్రోగుచున్నది. తామరకాడతో జలము లాగు విధముగా యోగి హృదయము నుండి గాలిని లాగుచున్నాడు. కోశభూతమగు దీనినుండి ప్రాణమును నర్థమాత్రాత్మకముగా జేసి సుషుమ్నానాళ మార్గమున లాగి భ్రూమధ్యమందు లయమొనర్పవలెను. భ్రూమధ్య స్థానమగు లలాటమందు నాసికా మూలమున అమృత స్థానమున్నది. అదియే బ్రహ్మ స్థానము.

## -: షడంగములు :-

ఆసనము, ప్రాణనిరోధము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి అనునవి షడంగములు. ఆసనములు ఎనుబది నాల్గుగలవు. వానిలో సిద్ధాసనము, భద్రాసనము. సింహాసనము, పద్మాసనము- అను నాల్గును శ్రేష్ఠములు.

## -: మూలాధారము :-

ఆధార కమలము గుదస్థానమున గలదు. దీనికి నాల్గు దళములున్నవి. సర్వమునకిది ఆధారముగా నున్నది; కావున ఆధారమని పేరు వచ్చినది. ఆధారము మొదటి చక్రము.

స్వాధిష్ఠానము రెండవ చక్రము. ఈ రెండిటికిని మధ్య కామరూపముగా యోని స్థానమున్నది, ఇది సిద్ధ వందితమై కామాఖ్యను బొంది యున్నది. దీనికి మధ్య భాగమున పశ్చిమాభి ముఖముగా లింగమున్నది. దీనిశిరోభాగమున మణివలె ప్రకాశించు మెఱుపు దీగవలె వెలుగుచు కుందనపు చాయతో అగ్ని ప్రకాశించు చున్నది. ఈ అగ్నికి పై భాగమందు మేఢ్రము నుండి క్రింద చతురశ్రముగా నాధారము ప్రతిష్ఠిత మగుచున్నది.

## -: స్వాధిష్ఠానము :-

స్వశబ్దముచేత ప్రాణము- అధిష్ఠానము నాశ్రయించు

చున్నది. గావున దీనికి స్వాధిష్ఠానమని నామము వచ్చినది. స్వాధిష్ఠానమును మేఢ్రమనియు చెప్పుదురు. దీనికి నాలు దళములు గలవు.

-: మ ణి పూ ర క ము :-

దారముతో గూడుకొన్న మణివలె ఇచ్చట నుండి వాయువుతో శరీరము పూరింపబడు చున్నది. అందుచే దీనికి మణిపూరక మని పేరు గల్గినది. దీనికి పదిదళములుగలవు.

ద్వాదశార మహాచక్రమందు పుణ్యపాపముల నిర్ణయము చేయబడియున్నది. ఎంతవరకు జీవుడు భ్రాంతినివీడడో అంతవరకు తత్వము నెఱుగజాలడు.

-: ద శ నా డు లు :-

మేఢ్రమునకు పై భాగమునను నాభికి క్రిందుగను కోడి గ్రుడ్డువలె నొకకందముగలదు. దానినుండి డెబ్బదిరెండు వేల నాడులు గల్గినవి. దీనిలో ప్రాణవాహినులగు పదినాడులు ముఖ్యములు. ఇడ మొదటిది. పింగళ రెండవది. సుషుమ్న మూడవది. గాంధారి నాల్గవది. హస్తిజిహ్వ ఐదవది. పూష ఆఱవది. యశస్విని ఏడవది. అలంబుస ఎనిమిదవది. కుహూః తొమ్మిదవది. శంఖిని పదియవది. ఇట్టి నాడీమయమగు నీ చక్రమును యోగులుమాత్రమే తెలిసికొనగల్గిరి.

ప్రాణవాహినులగు పింగళా సుషుమ్నలకు సోమ

సూర్యాగ్నులు అధిదేవతలు. ఇడ యెడమ భాగమునందును పింగళ కుడిభాగమునందును సుషుమ్న మధ్యభాగమందును గలవు.

## -: ద శ వా యు వు లు :-

ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము, నాగము, కూర్మము, కుకరము, దేవదత్తము, ధనంజయము అను పదివాయువులలో మొదటి నైదిట ప్రాణపంచకమనియు రెండవనైదిట వాయుపంచకమనియు చెప్పుదురు. ఇట్లు వేల కొలది నాడులు శరీరమున జీవస్వరూపముత్తై యున్నవి. ప్రాణాపానములకు వశుడైన జీవుడు క్రిందికి మీదకి పరుగులు వారుచున్నాడు. వామ దక్షిణమార్గముల సంచరించుచు జీవుడదృశ్యరూపముననున్నాడు. భుజదండములతో గొట్టక యెవ్వడును చలించడుగదా ! అట్లే ప్రాణాపానముల యొత్తిడిలేని జీవుడును చలించడు. పక్షిని ఉరిత్రాటితో లాగినట్లు ప్రాణమునుండి అపానమునుఅపానమునుండిప్రాణమునులాగవలెను. హకారముతో వాయువును వెలుపలకు వదలుచు సకారముతో లోపలకు లాగవలెను. ,, హంస హంస ,, యనుమంత్రము—దినమునకు ఇరువదియొక్క—వెయ్యి ఆరువందల పర్యాయములు జీవుడుజపించుచున్నాడు. దీనినే అజపాగాయత్రియందురు. అజపాగాయత్రిమంత్రము యోగులకు మోక్షదాయకము. దీనిచే నిరామయమగు బ్రహ్మస్థానము బొందవచ్చును.

పరమేశ్వరి ముఖద్వారము మూసికొని లోపల నిద్రించు

చున్నది. మనః ప్రాణముల నేక మొనర్చి వహ్ని యోగముతో ఆమెను నిద్రనుండి లేపవలెను. సూదిలో దారమెక్కించి నట్లు కుండలినీశక్తిని సుషుమ్నమున జేర్చి ఆసుషుమ్నమును ఊర్ధ్వభాగమును బొందించవలెను. మూయబడిన ముఖద్వారము హఠముతో బలాత్కారముగా బ్రద్దలుచేయవలెను. కుండలినీ యోగముతో యోగి మోక్షద్వారమును బ్రద్దలుచేయుచున్నాడు. యోగి రెండుచేతులను సంపుటితముగా గూర్చి బద్ధపద్మాసనమున గూర్చుండి గడ్డమును గుండెకు తగిలించి మనస్సుతో ధ్యాన మొనర్చవలెను. అపానమును పైకిలాగి మాటిమాటికి పూరించుచు మరల వదలుచు కుండలినీ శక్తి ప్రభావమునవలన నద్దాని ప్రాణములో జేర్చవలెను. పద్మాసనమున గూర్చుండి యోగి నాడీ ద్వారములయందు వాయువు పూరించుచు కుంభించవలెను. ఇట్లు చేయుటచే శరీరమున చెమటగల్గును. దానిని శరీరములో నింకునట్లుమర్దించవలెను ఉప్పుకారము పులుసుల వర్జించి క్షీరాజ్యమిశ్రిత గోధూమ శాల్యన్నములను ముద్గరసూపమును భక్షింపవలెను. ఇట్లు మితాహారిగను బ్రహ్మచారిగను యోగాభ్యాస పరుడుగను నున్నయోగి యోగసిద్ధుడగుచున్నాడు. ప్రాణపానముల నైక్యమొనర్చి నప్పుడు మూత్రపురీషములు శరీరమునందే యింకిపోవుచున్నవి.

## -: మూలబంధము :-

మూలబంధము వలన ముసలివాడు యువకుడగుచున్నాడు. ఎడమకాలి మడిమతో ఆధారమును కుడికాలి మడి

మత్తో యోనిస్థానమునువత్తి గుదమును పైకిలాగవలెను. అట్లే అపానమునుగూడ పైకిలాగవలెను. ఇట్లుచేసిన మూల బంధమగును.

-: ఉ డ్యా ణ బం ధ ము :-

మహాఖగము_ఆకసమున ఎడతెరిపిలేక యెట్లు ఎగుచున్నదో అట్లే ప్రాణమను మహాపక్షిని సుషుమ్నాకాశమున నెగురునట్లు చేయవలెను. ఇట్లుచేసిన దీనినే ఉడ్యాణ బంధమందురు. మఱియు ఉదరమునందు నాభియొక్క క్రింది మీదు భాగములు వెన్నెముకకు సోకునట్లు లాగుటకును ఉడ్యాణ బంధమందురు. ఇది మృత్యువను ఏనుగునకు సింహమువంటిది.

-: జాలంధర బంధము :-

జాలమనగా శిరాజాలము. అనగా నాడీసమూహము. జల సంబంధమగు కపాల కుహరమునుండి క్రిందికిప్రవహించు జలమునకు జాలమని నామాంతరము. దీనిని బంధించుటకు జాలంధర బంధమని పేరు, శిరస్సునువంచి గడ్డముతో నెదను నత్తుటచే నీబంధము సిద్ధించుచున్నది. ఇయ్యది కంఠరోగముల నశింపజేయుచున్నది.

-: ఖే చ రీ ము ద్ర :-

కపాల కుహరమందు నాలుకను విపరీతముగా జొనిపి దృష్టిని అంతర్ముఖముగా భ్రూమధ్యమున నిలుపవలెను. ఇట్లొ

నచ్చిన ఖేచరీముద్రియగును. కంఠ సంకోచనా రూపమగు జాలంధర బంధముతో ఖేచరీముద్రను సాధించునప్పుడు కపాల కుహరమునుండి వెలువడు చంద్రామృతము జఠరాగ్నియందు బడదు. ప్రాణవాయువును ఇష్టమువచ్చినట్లు పరుగిడ నీయక అరికట్టబడుచున్నది. దీనినభ్యసించిన ఆధివ్యాధి మరణములుండవు. నిద్రా మూర్ఛలు పీడింపవు. ఆకలి దప్పులు బాధింపవు. కాలకర్మములు గదియవు. చిత్తమును సహస్రారమున జేర్చి నాలుకను కంఠ కుహరమున జొనిపిన వాని ఖేచరీముద్ర యనబడును. దీనియభ్యాసమున మానవుడు-ఊర్ధ్వరేతస్కుడగుచున్నాడు. శక్తిచలనా రూపమగు వాయువుతో నెవ్వడు సహస్రారాకాశము రజః ప్రేరిత మగుచున్నదో ఎప్పుడు సూర్యునితో చంద్రుని నైక్యము చేయబడుచున్నదో అప్పుడీ దేహము దివ్యదేహ మగుచున్నది. చంద్ర సూర్య సంఘటనమువలన జలముల శోధన సిద్ధించుచున్నది

## -: మ హా ము ద్ర :-

రసముల యొక్క శోషణయే మహాముద్ర యనబడును. గడ్డమును వక్షస్థలమునకు తగిలించ వలెను. ఎడమ కాలి మడిమతో యోనిద్వారము పీడించవలెను. కుడిపాదమును రెండు చేతులతో గూర్చి పట్టుకొనవలెను. గర్భము యొక్క కుడియెడమ భాగముల వాయువుతో పూరించి మెల్లమెల్లగా రేచించ వలెను. ఇట్లు చేసిన మహాముద్ర యగును. దీనివలన సర్వపాపములు నశించును.

## -: ఆత్మ నిర్ణయము -:

హృదయ స్థానమున అష్టదళ పద్మముగలదు. దాని మధ్య భాగమున రేఖావలయిత మొనర్చుకొని జ్యోతిస్స్వరూపముగా జీవాత్మ ప్రకాశించు చున్నది. దానియందు సర్వము ప్రతిష్ఠితమగు చున్నది. అది సర్వము నెఱుగు చున్నది; సర్వమును జేయుచున్నది. "నేను కర్తను; నేను భోక్తను; నేను సుఖిని; నేను దుఃఖిని; నేను కుంటిని; నేను గ్రుడ్డిని; నేను మూగను; చెవిటిని; నేను బక్కవాడను; నేను బనుకను; అను నిట్టి స్వతంత్ర వాదములతో జీవుడు వర్తించు చున్నాడు.

## -: జాగ్రదాది-అవస్థలు-అష్టదళ పద్మ సంచారము :-

హృదయ చక్రపు పూర్వదళము శ్వేత వర్ణము. జీవుడట వసించి పుణ్యమతి యగు చున్నాడు. దాని ఆగ్నేయ దళము రక్తవర్ణము. అచ్చట జీవుడు వసించి నిద్రాలస్య మతి యగు చున్నాడు. దాని దక్షిణ దళము కృష్ణవర్ణము. జీవుడచ్చో వసించి ద్వేష క్రోధమతి యగు చున్నాడు. దాని నైరృతి దళము నీల వర్ణము. అట నివసించి జీవుడు పాప సంగత హింసాకర్మ మతియగుచున్నాడు. దాని పశ్చిమ దళము స్ఫటిక వర్ణము. అచ్చట జీవుడు వసించి సుఖ శృంగార స్వరూపమతియు.దాని యీశాన్యదళము వైడూర్య వర్ణము.అచ్చట వసించిన జీవుడు దానదయాపరత్వ మతియగు

చున్నాడు. దాని సంధిబంధములందు వసించిన జీవుఁడు వాత్ర
[illegible] మహావ్యాప్తి ప్రకోపుడగుచున్నాడు. దానిమధ్య
భాగమున వసించిన జీవుండు సర్వమును దెలిసికొనుచున్నాడు
వినుచున్నాడు; పాడుచున్నాడు; చదువుచున్నాడు; ఆనందించు
చున్నాడు. జాగ్రదావస్థయందిట్లు నేత్రశ్రమనొందిన జీవుడు
తన యెదుట కేశ్వరుడై పరిధమరేఖచుట్టు తిరిగి దాని
మధ్య నిమగ్నుడగుచున్నాడు. ఈ పరిధమరేఖ బంధూ
కవస్థము. జీవుడిట్లు సర్పుటచే తనకు నిద్రావస్థ గల్గుచున్నది
నిద్రావస్థ మధ్యలో స్వప్నావస్థయు, స్వప్నావస్థ మధ్యలో
చూచుటకును వినుటకును అనుమానాస్పదమగు మనోవికార
కల్పనము గల్గుచున్నది. దీనిచే తనకు అధికశ్రమగల్గుచున్నది
కని నివారించ కోరుకుహృదయ పద్మమునందలి రెండవ రేఖలో
[illegible] తాను చుట్టివచ్చుచున్నాడు. ఈ రెండవ రేఖ ఇంద్రి
యవశమ్ము. జీవుడిందులో దూరుటచే తనకు సుషుప్త్య
వస్థ గల్గుచున్నది. ఈ యవస్థయందు దాను బరమేశ్వర
సంబంధమును బుద్ధి నొందుచున్నాడు. అందుచే తనకు నిజబో
ధస్వరూపము గల్గుచున్నది. తరువాత పరమేశ్వరుడే తానగు
చున్నాడు. ఇక జీవుడా హృత్కమలమందలి మూడవరేఖలో
ప్రవేశించి చుట్టువ ప్రదక్షిణ మొనర్చి నడుమ దూరుచున్నాడు.
ఈ మూడవరేఖ వజ్రాగాకృతి గల్గియున్నది. దీనిలోచేరుట
వలన తనకు తురీయావస్థ ప్రాప్తించుచున్నది. కేవల పరమా
త్మసంబంధము గలది తురీయమని చెప్పబడుచున్నది. తాన
న్నిటు మెల్లమెల్లగా ఉపరమ బుద్ధితో ధృతినిగ్రహించి మన
స్సును ఆత్మలోజేర్చి ఇతర చింతలు మాని యుండవలెను.

పిమ్మట ప్రాణాపానముల నైక్యమొనర్చి సర్వప్రపంచము ఆత్మస్వరూపమను లక్ష్యముతో భావించవలెను. ఇదియే తురీయా తీతావస్థ. ఈ ప్రకారముగా నొనర్చిన ఆత్మదర్శన ప్రాప్తిగల్గుచున్నది శృంగాటకమందు మహాద్వారముగలదు. తద్గతవాయువుతో చెప్పబడిన సుషుమ్నకు త్రికోణార్థ గమన మందు చ్యుతి గనుపించుచున్నది. ఈ త్రికోణస్థానమునకు పై భాగమున పృధివ్యాధి పంచభూతములను ప్రాణాది పంచవాయువులను బీజములను వర్ణములను తన్మాత్రలను శక్తులను దేవతలను వానిస్థానములను ధ్యానింపవలెను.

1. పృధివీ భూతమునకు వ్యానవాయువు, లంబీజము బంధూక పుష్పవర్ణము, గంధతన్మాత్ర, క్రియాశక్తి, నాసికా స్థానము, సృష్టికార్యము గలవు. ఇట బ్రహ్మను ధ్యానించవలెను.

2. జలభూతమునకు:—ఉదాన వాయువు, వంబీజము, శంఖవర్ణము, రసతన్మాత్ర ఇచ్ఛాశక్తి శ్రోత్ర స్థానము స్థితి కార్యముగలవు. ఇట శ్రీమహా విష్ణువును ధ్యానింపవలెను.

3. అగ్ని భూతమునకు:—అపానవాయువు, రంబీజము సూర్యవర్ణము, రూపతన్మాత్ర, జ్ఞానశక్తి, నాభీస్థానము, సంహారకార్యము గలవు. ఇటరుద్రుని ధ్యానింప వలెను.

4. వాయుభూతమునకు:— ప్రాణవాయువు, యంబీజము, నీల మేఘవర్ణము. స్పర్శతన్మాత్ర, ఆదిశక్తి, హృదయ స్థానము, తిరోధాన కార్యము గలవు. ఇట మహేశ్వరుని ధ్యానింప వలెను.

5. ఆకాశ భూతమునకు:- సమాన వాయువు, హంబీజము, స్ఫటిక వర్ణము, శబ్దతన్మాత్రి, పరాశక్తి, పాదాంగుష్ఠ స్థానము, అంతర్ధాన కార్యము గలవు. ఇట సదాశివుని ధ్యానింప వలెను.

ఇట్లు డెబ్బదిరెండు వేల నాడీ మార్గములు, ఇరువది తొమ్మిదికోట్ల రోమ కూపములు గల ఈ శరీరమున జీవ సంచారము జరుగు చున్నది. సమాన ప్రాణములనేక మొనర్చినప్పుడు జీవుడును [శివునితో] నేకమగు చున్నాడు. రేచక పూరక కుంభకముల నొకటిగా నొనర్చి సమాహిత దృఢ చిత్తము గల్గియుండవలెను. హృదయ కమల కోటరమున హంసా హానముల ప్రణవముతో గూర్చి ధ్యానింప వలెను, ముందు కంఠ సంకోచనమును పిమ్మట లింగ సంకోచనమును చేయవలెను.

సహస్రారములోని దారమునవలె మూలాధారము నుండి సుషుమ్న ప్రకాశించు చున్నది. వీణాదండము నుండి పయలుదేరిన నాదము అమూర్తమై వర్తించునట్లు సుషుమ్నానాళ మధ్యమున శంఖాది నాదములతో ప్రణవ ధ్వని మ్రోగు చున్నది. వ్యోమరంధ్రమును బొందిన నాదము మయూర నాదమగు చున్నది. కపాల కుహరమునకు మధ్య భాగమున శృంగాటకమునకు నడుమ ఆకాశ మధ్యమున నున్న సూర్యుని వలె ఆత్మ ప్రకాశించు చున్నది. ఎచ్చట ఆత్మ ప్రకాశమును దర్శించు చున్నదో అచ్చట మనోలయ మగు చున్నది. మనోలయమే ఆత్మకు పరమావధి.

ఇట్టీ గ్రంథమున కియ్యది యనుబంధముగ నాచే రచింప బడినది. జన సామాన్యమునకు నీ తారక యోగము నందుబాటుకు తెచ్చి ప్రసాదించిన శ్రీరాజ యోగీంద్రుల వారు ప్రశంసా పాత్రులు. జాను తెనుగున తేట పదములతో తేనెసోనల మరపించువీరి తత్వామృతము తెనుగు జనము తనివి దీరగ్రోలి జనన మరణ ప్రవృత్తి ప్రవాహము నుండి తరించునుగాక.

ఇట్లు సాధక జనమునకు మహోపకారమొనర్చిన శ్రీయోగీంద్రుల వారికి పరమ గురు కృపచే ఆయురారోగ్య సంపూర్ణ సర్వోదయ సంప్రాప్తి సంఘటిల్లు గాతయని పరమ దేశికుల సంప్రార్థన మొనర్చు చున్నాను.

సీ॥ నాముద్దుసుత? యుపనయనంబు గానిదే
యుపనయనముమీదనున్న చదువు
నే చపలుండూహ నెఱుంగఁదలంచునో
విపరీతమగు దానవిను; కుమార!
పరికింపగా వాఁడు బ్రాహ్మణుండే కాడు:
వానినర్చింపరెవ్వార; లట్లు
యుక్తి చేనిజబోధ నూహింపనిక్కుడు॥
కపటచిత్తుడు సాధు గణముతోడ
సాటిగాఁడెన్నటికి బెక్కుమాటలేల ?
వినయ గుణసీల! యనిగురువిభుఁడుపలికె:
శ్రీదయానంద! పాలిత శిష్యబృంద!
రాజయోగీంద్ర! సద్గురు రాజచంద్ర!

వేమనాశ్రమం
ప్రొద్దుటూరు

ఇట్లు.
కడివేటి నరసారెడ్డి

# అ వ తా రి క

శ్రీమద్వైద వేదాంతవేత్తలును, ఆత్మైక్య శరీర రహితులును, జనన మరణ భ్రాంతిరహిత రాజమార్గ బ్రహ్మాద్వా సిష్ట సిద్ధాంత నిర్ధారణులును శ్రీమదచల పరిపూర్ణ బోధ ప్రతిష్టాపనా చార్యులునునగు శ్రీమద్రామడుగు శ్రీశివరామ దీక్షితాచల పరిపూర్ణస్వామివారు శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాశిష్టము నలుబదిమూడు ( 43 ) ప్రకరణములు పీఠగ్రంథముగా రచియించి చలాచల వాక్యములు మొదటి భాగముగాను, ద్వాదశభావము రెండవ భాగముగాను షోడశిభావము స్వప్నదృష్టాంతములు మూడవ భాగముగాను,అచలభోద ద్రుష్టాంతములు నాల్గవ భాగముగాను ప్రకటింప జేసిరి శ్రీ భాగవత కృష్ణదేశికులవారు శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థములు, క్షరాక్షరోపాది ద్వయ దోషరహిత కందపద్యములు రక్షించి పీఠగ్రంథముగా ప్రకటింప జేసిరి శ్రీసచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వాముల వారు మహాద్వైత పరమతత్వ కందార్ధములు రచించి పీఠగ్రంధముగా వెలువరింపజేశిరి శ్రీ భూమానంద హనుమంతరావు దేశికేంద్రులవారుసందేహ నివర్త్యోపన్యాసము రచించిపీఠగ్రంథముగా ప్రకటింప జేసిరి అచలఋషి దయానంద పౌన్నాల రాజయోగిగారు అచలపరిపూర్ణ రాజయోగీయ నిజప్రబోధ విధానము, తారకామృత పరమహంస ప్రబోధిని యను గ్రంథరాజములు పీఠగ్రందములుగా రచించి ప్రకటింపజేశిరి.

ఇట్లు

అచలర్షి దయానంద రాజయోగి

★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★★

ఓం

--( శ్రీ గురుమూర్తి )--

# తారకామృత
# పరమహంస ప్రబోధిని
# రాజయోగీయము

కం॥ పరమహంసా శ్రమధరుని
పరిపూర్ణపుబోధ వాని పనులుఃసమమే
వార్నెరి గెరుగక నుతినిందలు
గరిపిన తత్పలము ప్రజలకగు నిజము సుమీ॥

కం॥ ఏపురుషుడు గురువర్యుని
శ్రీపాదము బట్టలేదో సేలుగనాతం
డీపుస్తకమునుజూచిన
యేపట్టున నిలువకేగు నిదినిజమయ్యా॥
నరులారమీ మదిదెలియరయ్యా
యీపరమగోప్యము యెవరెరుగరోయయ్యా
నాపలుకు మదిలోననాటీనవారికేయిదినిజమయ్యా
నరులార మీమదిదెలియ రయ్యా॥

కం॥ గురుచరణజలము గోదావరియని
గురుమూర్తి రామభద్రుండని

తత్పురమును భద్రాచలమని
గురుమంత్రమే తారకమని గురిగలిగినట్టి
తిరిగిరాని మరుగెరిగినట్టి నరుడున్న చోటే
సుందర శేషగిరి భద్రగిరి రంగనాయకపుర మా
నదగియుండు గురికల్గినట్టి తిరిగిరానిమరుగెరుగునట్టి

కం॥ దేశికుని చరణతీర్థము కాశీగంగయని
గురుని గనుగొన్నను విశ్వేశుడని యతడుతన
కుశ దేశంబానరించునట్టిదే తారకమనీ
మనసందు తా నీతీరున గనీ యేశీమయందున్న
కాశీప్రయాగ రామేశుని పురమై
ప్రకాశించునాశీమ దేతాంకమనీ
మనసందు తానీ తీరునగనీ॥

## తారకయోగ నిర్ణయము.

తారకయోగము బ్రహ్మసాక్షాత్కారమునకు గారణామైన మొదటికర్మగా నున్నది; కనుక మోక్షాధికారి. తారకయోగమును ముందుఁదెలియవలయును.

నాడులయొక్కయుఁ జక్రములయొక్కయు విధాయకము దెలియనియెడల నీతారకయోగపద్ధతి దెలియఁబడదు-

నాసికారంధ్రమునుండి వెడలు ప్రాణవాయు విడాపింగళాభిఖ్యలతో వ్యవహరింపఁబడుచున్నది.

ఈ రెంటియొక్క చేరికచేఁ గలుగును దానవాయువు బాహ్యసుషుమ్నయని చెప్పబడును.

బాహ్యసుషుమ్నను నధో భాగమునకు నణగద్రొక్కిన యెడల నపానవాయువుతో జేరి యది యధోకుండలిని మేల్కొల్పును పిమ్మట బ్రహ్మదండి మధ్యభాగమున నున్న యంత సుషుమ్నా నాళమునందుఁ బ్రవేశించును తరువాత సూర్య చంద్ర సమైక్య రూపమగు స్వయం ప్రకాశత్వము పొందును.

స్వయం ప్రకాశమగు సుషుమ్నా నాడియందు నావరణ రూపమగు నాలు పద్మములుగలవు. సుషుమ్నా నాళమార్గాంతమున సహస్రారము మఱియు నష్టదళపద్మము వరకు ననఁగా బ్రహ్మరూప స్వయంప్రకాశము వఱకు దీని మార్గాంతము బ్రహ్మమునందు నైక్య మగుటయే యీమార్గముయొక్క యంత్యమని తెలియవలయును. ఇట్టి నాడియందు నవయవములతోఁ గూడిన చక్రనిర్ణయ మిట్లు తెలియనగును.

మూలాధార చక్రమునకు నాలుగుదళములు; వశషస అను నాలుగక్షరములు; అపరంజివర్ణము; పృథ్వీ భూతము; నాసికము కారణము; దానినాయకుండైన వినాయకునకు—అజపాగాయత్రీ మంత్రజపమందు—ఆఱునూర్ల హంసలర్పింపబడును.

లింగస్థానమందు స్వాధిష్ఠాన చక్రము; ఆరక్షరములు ఆఱుఱేకులుగల తెల్లనివర్ణము; జలమునకు స్థానము; నాలుక కారణము; దానికధిపతియైన బ్రహ్మకు—అజప గాయత్రీ మంత్రజపమున ఆఱువేల హంసలు సమర్పింపబడును.

నాభినందు మణిపూరక చక్రము; పదియక్షరములు; పదిదళంబులు; యెఱ్ఱనిరంగు; అగ్నిభూతము; నేత్రంబులకు కారణమైయుండును; దానికధిపతియైన విష్ణునకు-అజపాగాయత్రి మంత్ర జపమున—ఆఱువేల హంసలు అర్పింపఁబడును.

వక్షస్థలమందు అనాహతచక్రము; పన్రెండుదళములు పండ్రెండక్షరంబులు; ఆకుపచ్చవన్నె; వాయుభూతము; చర్మము కారణమైయుండును; దానికధిపతియగు రుద్రమూర్తికి అజపా గాయత్రి మంత్రజపమున ఆఱువేల హంసలు సమర్పింపబడును.

కంఠ స్థానమందు విశుద్ధ చక్రము; పదియాఱు దళంబులు; పదియాఱక్షరంబులు; నీలవర్ణము; ఆకాశ భూతంబు; శ్రోత్రంబులకు కారణంబు; దానికి ప్రభువగు జీవరూపుడైన విశ్వాభిమాని యీశ్వరునికి అజపా గాయత్రీ జపమందు వేయిహంసలు సమర్పింపఁబడును.

భ్రూమధ్యమందు— ఆజ్ఞాచక్రము: రెండు దళంబులు; రెండక్షరంబులు; మాణిక్య వర్ణంబు; అంతఃకరణ నిలయంబు; సకలేంద్రియ వ్యాపారంబులకు కారణంబు; దానికి ప్రభువగు పరమాత్మ రూపుండైన సదాశివునకు- అజపా గాయత్రీ మంత్ర జపమందు: వేయిహంసలు సమర్పింపఁబడును.

ఆజ్ఞాచక్రము మీఁద ఒక అంగుళము వఱకు చిచ్ఛక్తి యని; దానిపై మూండగుళముల వఱకు వ్యాపినీశక్తియని; ఆవల నాలుగంగుళముల వరకు సమన శక్తియని; అమీఁద నాలుగంగుళముల వఱకు ఉన్మనిశక్తియని చెప్పబడును- ఈ

పంద్రెండంగుళముల మీఁద బ్రహ్మరంధ్రము: ఇదే ద్వాదశాంతము. దీనియందు వేయి దళములుగల సహస్రార చక్రము గలదు- అది నూటయిరువదియైదు చిన్న రేకులుగల ఎనిమిది పెద్ద రేకులుగలిగి యుండును- ఇదే అష్టదళపద్మము. దీని మధ్యమందు శివబీజమైన హకారమును; శక్తి బీజమైన సకారమును; ఈ రెంటి నడుమ బిందురూపమైన బుద్ధి తత్వము ప్రకాశించు చుండును. ఇదే మూకాక్షరము; దీనిఁదెలిసి లక్ష్యముంచిన వారే పరమహంసలు; అవధూతలు; జీవన్ముక్తులు.

హకారబిందు సకారములే పతిపాశ పశువులు. నాద బిందుకళలు. సోమసూర్యాగ్ని మండలములు ఈహకారబిందు సకారములు తమ్మునమ్మిన వారిని సంసార బంధంబు హరించునవి: కావున హంసయనఁబడును.

తత్పదమే హకారము: త్వంపదమే సకారము; వీని యైక్యమైన అసిపదమే బిందువు; కావున జ్ఞానులకు నిదియే జీవేశ్వరైక్య రూపమగు యోగము.

ఆత్మజ్ఞానా జ్ఞానమిళితమైన ప్రపంచమందు నీళ్ళనెడి అజ్ఞానమును విడిచిపాలనెడి జ్ఞానమును వహించుఁగావున హంసపక్షి యనఁబడును.

1 హంస అష్టదళ పద్మమందలి తూర్పు రేకుపై వ్రాలిన పుణ్యకర్మమును చేయవలెనను తలంపును,

2 ఆగ్నేయ దళమందు వ్రాలిన సోమరితనమును.

3 దక్షిణపు దళమందు వ్రాలిన క్రూర కార్యముల చింతయును.

4 నైరృతి దళమందు చేరిన పాపకార్యములు సలుప వలయుననెడి బుద్ధియును.

5 పశ్చిమ దళమందు నిలిచిన ఆటపాటల చింతయును.

6 వాయవ్య దళమందు చేరిన నడుచుట పరుగెత్తుట యను కోరికలు.

7 ఉత్తర దళమందు వ్రాలిన రతిననుభవింపవలయు నను ప్రీతియు.

8 ఈశాన్య దళమందు చేరిన దానవైరాగ్య చింతయు.

కేసరములయందు ప్రవేశించిన జాగ్రత్తయు. కర్ణిక యను దుద్దునందుఁజేరిన స్వప్నంబును. పద్మనాళమున దిగిన నిద్రయును గలుగును. ఈపద్మమును విడుచుటయే తురీయము.

దేహేంద్రియాది ప్రపంచ విలక్షణమైన పరమాత్మయే నేనని ప్రతిపాదించుచున్నది అట్టి ప్రత్యగాత్మ రూపమైన హంసయెచ్చోట పుట్టునో అట్టి నిర్వికల్ప స్థానమే పరబ్రహ్మ మని యెఱుఁగవలెను.

1 ప్రశ్న॥ సకల దేహములయందు హంస యేప్రకారము సృష్టి ఆయెను ?

ఉ॥ ప్రత్యగాత్మ యొక్క కళహాకారంబును ప్రకృతియొక్క కళ సకారంబును ఈ రెంటి కూడికయందు బిందువు చేరగా హంసయగుచున్నది.

2 ప్రశ్న॥ హంససృష్టికి స్థానమేది ?

ఉ॥ జీవేశ్వరతను చతుష్టయమధ్య ప్రదేశము హంస స్పష్టి స్థానము.

3 ప్రశ్న॥ హంసయొక్క వ్యాపక మెంతవరకుండును?

ఉ॥ హంసయొక్క వ్యాపకము ఘంటిక స్థానమందు నెలవయి సకల నాడులద్వార దేహమంత గలసియుండును.

4 ప్రశ్న॥ హంస నాడులలో ప్రవేశించి యెన్నివిధ ములవ్యాపారము చేయును ? అవియేవి !

ఉ॥ హంస తనువందు మూడు విధములుగా పనులు జేయును.

1 అష్టదళ పద్మపుమధ్య జపమును.

2 ఘంటికయందు నడకయు.

3 ఆజ్ఞేయమందు వ్యవహారమునుగలిగియుండును

5 ప్రశ్న॥ అష్టదళపద్మమునకు గంటికకు ఆజ్ఞేయము నకు స్థానములేవి.

ఉ॥ అష్టదళ పద్మము శిరస్సుమధ్యయుండును ప్రత్యగాత్మకు దళమునకు మధ్యఅవకాశము దీనికి స్థానము.

2 ఘంటికయనగా నాళ్ళపుట్టినస్థానము; మఱియు దీనిని నాళ్ళముడియనియు చెప్పబడును అది అష్టతనువులకు మధ్య ప్రాగీశాన్య దళములకు నడుమ యుండును.

3 ఆజ్ఞేయమనగా ఉత్పత్తి, స్థితి, లయ, విక్షేప. అకర్షణ ములచేయునట్టి బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివు లకును క్రియ ఇచ్ఛ జ్ఞాన అవి పరాశక్తులకును వ్యవహారస్థానము; ద్విదళమధ్య ప్రదేశము. దీనిని భ్రూమధ్య స్థానమని చెప్పంబడును.

6 ప్రశ్న॥ హంసయే మంత్రము చేత జపము చేయును!
ఉ॥ రామ మంత్రము చేత జపము చేయును.

7 ప్రశ్న॥ రామమంత్ర నిర్ణయ మెట్టిది ?
ఉ॥ అగ్ని బీజమగు రకారము. శక్తిబీజమగు మకారము. ఆకాశ బిందురూపమగు దీర్ఘముతో జేరి రామయను మంత్ర రాజమాయెను. ఈ మంత్రము ప్రకృతి పురుషసంబంధ యుక్తమయి మోక్షప్రదముగా నున్నది; దీనిని దేవతలు పార్వతీశులు. యక్షులు. కిన్నరులు. కింపురుషులు. నరులు. జపించి కృతార్థులైరి.

8 ప్రశ్న॥ హంసఅష్టదళ పద్మముననుండుటకు కారణ మేమి ?

ఉ॥ బ్రహ్మాదికి స్థానము పద్మముగనుక బ్రహ్మకు వాహనంబగు హంస అష్టదళ పద్మమందునుండి వ్యవహరించు చుండును.

9 ప్రశ్న॥ సత్యలోక నివాశియగు బ్రహ్మకమలము నందుండుటకు కారణమేమి?
ఉ॥ అష్టదళ పద్మము సహస్రారము. ఇది సప్తమస్థానమగుటచే సత్యలోక మనఁబడును.

10 ప్రశ్న॥ హంస యెచ్చట ఏ నామములు పొందును.
ఉ॥ కమల మధ్యంబున అచల హంసయనియును.
గంటిక యందుకల హంసయనియును.
ఆజ్ఞేయమందు జీవ హంసయనియు– జపహంస యనియు నామంబులు పొందును.

11 ప్రశ్న॥ జపహంస అచల హంసయెట్లగును?

ఉ॥ కమలమునందు. గంటిక యందు. ఆజ్ఞేయ మందు. అధ్యాత్మిక ఆధిభౌతిక. ఆధిదైవిక. ప్రాపంచీ కచల నాడులు హంసకు లేవుగనుక అచల హంసయని చెప్పబడును.

12 ప్రశ్న॥ హంసకు పక్షినామమెట్లు కలిగెను?

ఉ॥ పాలునీరు కలిసియున్నట్లు జ్ఞానాజ్ఞానములు కలిసియున్నందున జ్ఞానాజ్ఞానములను వేరు చేసి అజ్ఞానమును విడనాడి జ్ఞానమును గ్రహించు చున్నందున హంసయనియు-ఉచ్ఛ్వాస విశ్వాసములను పక్షములలోనిది శరీరాకాశమున విహరించుచున్నది కావున దీనికిం బక్షియనియు వ్యవహారము గల్గినది.

13 ప్రశ్న॥ ఘంటిక యందుకలహంస యనుటకు కారణమేమి?

ఉ॥ అజ్ఞానము విడనాడి జ్ఞానము గ్రహించుటకు ఘంటిక స్థానముగనుక ఘంటిక యందలి హంస కలహంసయని చెప్పబడును.

14 ప్రశ్న॥ ఆజ్ఞేయమున జీవహంసయని యెందుకనవలయును?

ఉ॥ హంస ప్రాణవాయువుతో జేరి జీవపద్ధతిని బొంది వ్యవహారమునకు కారణమగుటచే జీవహంసయని చెప్పబడును.

15 ప్రశ్న॥ తనువందు హంసఏ పద్ధతిగా నుండును?

ఉ॥ దేహేంద్రియాదులను గలిసి. వ్యాపార మొనరించును. గంటిక యనే యంతర సుషుమ్న చీలవెలి రంధ్రముద్వార భ్రూమధ్య మను భాహ్యసుషుమ్న చంద్రసూర్య నాడుల

ప్కార నటించి నేను నేననుచు వ్యవహారము చేయుచుండును. అదియె హంస యనబడును.

16 ప్రశ్న। జీవునికి హంసకు రూపమునందు భేదము గలదా?

ఉ। జీవునికి, హంసకు రూపమునందు భేదములేదు. ఏక రూపమే కాని హంసయొక్క సత్వాగుణ వృత్తులతో జేరగా జీవుడని పేరుగలిగెను.

17 ప్రశ్న। శరీరము నందలి హంసకు నేయే నామములు గల్లును?

ఉ। జ్ఞాతయని సాక్షియని హంసయని ప్రణవమని తెలివియని ఆత్మజ్యోతియని కళయని గురుడని యెరుకయని నేనని ఊహయని జ్ఞప్తియని బ్రహ్మమని పర్యాయ నామములు గలవు.

18 ప్రశ్న। హంస ఆజ్ఞేయమున నిలుచుటకు కారణామేమి ?

ఉ। ప్రపంచ సృష్టికొరకు మానసాదులకూడి నేను నేనని మెలగుచు సర్వము చేయుచుండును ?

19 ప్రశ్న॥ నేనను అక్షరసముదాయము యెట్లు నిర్ణయమాయెను ?

ఉ। హాకార సకారములు రెండు ఆజ్ఞేయమందుండి వ్యవహార శూన్యముగానుండును అందువల్ల ధ్వన్యాత్మకమగు బిందువు వర్ణాత్మకమగు హల్లుతో చేరగానే నని వ్యవహారము గల్లును.

20 ప్రశ్న॥ మంత్రమునందు దీర్ఘము నడుకయందు బిందువు వ్యవహారమునందు పోల్లు ననునవిఏకమా అనేకమా

ఉ॥ ధీర్ఘము. బిందువు. పోల్లులను త్రివిధములు వ్యావహార భేదములు కావు వస్తువుమాత్రమేకముగా నున్నది.

21 ప్రశ్న॥ ఏకముగా నున్నదానిని త్రివిధములుగా నెందుకు చెప్పవలెను ?

ఉ॥ కర్త. కర్మ. క్రియ. యను త్రివిధపద్ధతులుగా తెలివిరూపమైన దీర్ఘము వస్తునిర్ణయరూపమగు బిందువు జపయుక్తమగు వ్యవహారమగుపోల్లు త్రివిధములు ఏకమే.

22 ప్రశ్న॥ హంసయొక్క అవయవములు వాటినివాసస్థానములు దానివ్యవహారము లేవి ? వాటిని తెలిసినందువల్ల కలుగు ఫలంబులేవి ?

ఉ॥ హంసయొక్క అవయవములు శిరము కాల్లు ఱెక్కలు కమలమధ్యమున శిరము ఘంటికామధ్యమున చరణములు ఆజ్ఞేయమందు రెండుఱెక్కలుండును.

1 శబ్దరూపమగు జపస్థానము వాగేంద్రియము హంసయొక్కజపము నిశ్శబ్దము గనుక నాసికారంధ్రము దాని స్థానము అందులకే హంసయొక్క శిరస్సు కమలమధ్యమున నుండునని చేప్పబడుచున్నది.

2 చరణములుద్వార నడక గనుక హంసయొక్క చరణములు ఘంటికయందు నుచ్ఛ్వాస నిశ్వాసములద్వారగా నడకగలిగి యుండును.

3 విసరు చెక్కలు ఆజ్ఞేయదళమునందుండి చలనము గలిగించును.

1 దళములమధ్యన జపము తనువు తరించుటకు ప్రజ్ఞాన రూపమున మోక్షము కోరుచుండు.

2 గంటికయందు నడక జ్ఞానాజ్ఞాన నిర్ణయముకొరకు జెలగుచుండును.

3 ఆజ్ఞేయమందు వ్యవహారము జాగ్రిదావస్థ సృష్టికొరకు జీవభావము గైకొని యుండును.

23 ప్రశ్న॥ హంసకు నేను నేన నే అభిమానమెట్లు కలుగును ?

ఉ॥ రామయను అక్షరసముదాయము అకారముసూచించును హంసయను అక్షర సముదాయము అకారమును సూచించును, అందువల్ల అకారసాజ్ఞ ఊర్ధ్ద స్థానము సూచించుచుండును గనుక మూర్ధస్థానమున నిలచియున్న ప్రత్యగాత్మ నేను నేనని సూచించుచుండును.

24 ప్రశ్న॥ హంస బాహ్యాంతర సుషుమ్నలయందెట్లు సంచరించును ?

ఉ॥ ప్రాణవాయు రూపముగా సంచరించును.

25 ప్రశ్న॥ ప్రాణవాయువు హృదయ స్థానమందు వసించునుగదా? గంటిక యందలి హంసను నెట్లుకలియును? జీవహంసయని యెట్ల అనబడును

ఉ॥ అంతర ఇడాపింగళయనెడీ నాడులు తనుమధ్యంబున స్థంభమువలె పాదుకొని యుండు బ్రహ్మాదండికి కుడియెడమల గుండవెలసి శరీరమునందు హృదయము వరకు వ్యాపించి ప్రాణవాయు రూపమున గంటిక యందలి హంసను గలిసి భూమధ్యమున జేరుటచే జీవహంసయని చెప్పంబడును.

26 ప్రశ్న॥ అంతర సుషుమ్న యెచ్చట బుట్టును? ఎంతవరకు జెలిగి అంతర సుషుమ్న యని పేరుపొందును? ఎచ్చట చీలును? ఇడాపింగలులగా నెట్లు జెలెగెను?

ఉ॥ గంటిక యందు బుట్టిన సుషుమ్నతను మధ్య మూర్ధో భాగముగా కొండనాలుక వరకు వచ్చి అంతర సుషుమ్న యని పేరుబొందును. అక్కడనుండి రెండుగా చీలి యిడా పింగళల నెడు నామమును బొంది హృదయ స్థానమునకువచ్చి తనువందు వ్యాపించును.

27 ప్రశ్న॥ బాహ్యాసుషుమ్న యెక్కడ పుట్టును? ఏనామములుజెందును?

ఉ॥ ఘంటిక యందు బుట్టి అజ్ఞేయమునకు వచ్చి రెండుగా చీలి నాసిక మార్గముగా ఇఢాపింగళల రూపమున బాహ్యా మునకు వెడలును దీనిని బాహ్యాసుషుమ్న యనబడును.

28 ప్రశ్న॥ ఒకే ప్రాణవాయువునకు బాహ్యాంతర ములనె సొజ్ఞయెట్లు కలిగెను?

ఉ॥ ప్రాణము అంతరసుషుమ్న నాళమధ్యనుండి సంచ రించును. అందువలన అంతర సుషుమ్న యని అజ్ఞేయము

నుండి నాసికా ద్వారముగ బాహ్యమునకు వెడలినందున బాహ్య సుషుమ్నయని నిర్ణయము

29 ప్రశ్న॥ బాహ్యాంతరముల యందు సంచరించె ప్రాణము దేనితో కూడి యేమిపనులు చేయును?

ఉ॥ ప్రాణవాయువు హంసతో గూడి అంతర భాహ్య సుషుమ్నల యందు సూర్యోదయము మొదలు మఱల సూర్యోదయము వరకు (21600) ఇరువది యొక్క వెయ్యి ఆఱు నూరుల హంసలు నిర్ణయానుసారముగ చక్రముల యందును శ్వాసనిశ్వాస రూపమున సంచరించు చుండును. ఈ వ్యవహారమునకు సకార సంబందమని నిర్ణయము.

30 ప్రశ్న॥ చక్రము లెచ్చట యెన్ని యున్నవి?

ఉ॥ అంతర సుషుమ్న యందైదు చక్రములు? భాహ్య సుషుమ్న యందునేక చక్రము ఈ రెంటి చేరికకు పై భాగమున నొక చక్రమున్నది మొత్తము సప్త చక్రములు.

31 ప్రశ్న॥ వాని పేరులేవి?

ఉ॥ ఆధార స్వాధిష్టాన మణిపూరక అనాహత విశుద్ధముల నెడి ఐదు చక్రములు అంతరములు. అజ్ఞేయమనెడి చక్రము బాహ్యము; సహస్రారమనెడి చక్రము ఊర్ధ్వము.

32 ప్రశ్న॥ పంచముద్రలకు స్థానమేది?

ఉ॥ జాగ్రదావస్థకు అజ్ఞేయ చక్రము స్థానమై యున్నది గనుక పరమ తారకమునకు సాధనమైన పంచ ముద్రలకు ఆజ్ఞేయ చక్రము స్థానమై యున్నది.

33 ప్రశ్న॥ సుషుమ్న మార్గముగుండా నెచ్చటికి వెళ్ల వచ్చును ?

ఉ॥ సుషుమ్నయొక్క యూర్ధ్వమార్గమున మోక్షమునకు మధ్యమార్గమున నాదిత్యలోకమునకు ( ఇదే సూర్యనాడి; మరియు ఇడనాడియని చెప్పబడును ) అధోమార్గమున చంద్రలోకమునకు [ దీనినే చంద్రనాడి మరియు పింగళా నాడియని చెప్పబడును. ] వీనిని ధూమాద్రి అర్చరాది మార్గములుగా నిర్ణయింతురు.

34 ప్రశ్న॥ సుషుమ్న యొక్క యూర్ధ్వ మార్గమునకు మోక్షమార్గమని చెప్పుటకు కారణమేమి ?

ఉ॥ సుజ్ఞాన సంబధమగు తురీయ తుర్యాతీతమను అవస్థలు బొందుటకు వెళ్లునట్టిమార్గము సుషుమ్నయొక్క యూర్ధ్వ భాగమే గనుక మోక్షమార్గమని చెప్పబడును.

35 ప్రశ్న॥ సుజ్ఞాన సంబంధమగు అవస్థలు బొందుటకు శరీరమేది ? దానియవస్థయేది ?

ఉ॥ అష్టప్రకృతులయందు జనించిన మహాకారణశరీరము; దాని అవస్థ తురీయము దీనియూర్ధ్వమునందలి ప్రత్యగాత్మ తుర్యాతీతఅవస్థయని కైవల్య శరీరమని చెప్పబడును.

36 ప్రశ్న॥ బాహ్యాంతర చక్రముల పైనున్న చక్రమునకు స్థానమేది ?

ఉ॥ ఉపజిహ్వాకు ప్రాగ్దిక్కున త్రిపుటికి మధ్యమందు గంగాయమునలు కలిసిన సరస్వతి సంగమమున అమృత నదిపైన పుండరీకముం [ తెల్లదామర ] డును; దీనినే అష్టదళ కమలమని నిర్ణయింతురు.

37 ప్రశ్న॥ చక్రములయందలి అధిష్టాన దేవతలు హంసయొక్క అర్పిత నిర్ణయముయెట్లు ?

ఉ॥ 1 గుదస్థానమందు నాదారచక్రము దీనిఅధిదేవత గణపతి అధారభూతుడై యితరదైవములచేత సకలకార్యములుచేయించును; ఇచ్చట ( 600 ) నాఱువందల హంసలు లయమగును

2 స్వాధిష్టానచక్రము గుహ్యస్థానము నందుండును. దీని అధిదేవత బ్రహ్మ; స్థావర జంగమాత్మకములగు జీవులను సృష్టిజేయును వీరికి [ 6000 ] నాఱువేల హంసలు లయమగును.

3 మణిపూరకచక్రము నాభిస్థానము నందునుండును! దీని అధిదేవత విష్ణువు; అన్నరసాదులయొక్క స్థూల సూక్ష్మ భాగములచే జీవోపాదులను పోషించును వీరికి( 6000 ) నాఱువేల హంసలర్పితము.

4 అనాహత చక్రము హృదయస్థానమున నుండును; దీని అధిదేవత రుద్రుడు. సకలజీవులను లయముచేయును; ఇచ్చట ( 6000 ) నాఱువేల హంసలర్పితమగును.

5 విశుద్ధచక్రము తాలుమూలల నడుమ కంఠ స్థానము నందునుండును; దీనిఅధిదేవత ఈశ్వరుడు; వైఖరిచేఁ బలుకులు పలికింపజేయును; ఇచ్చట ( 1000 ) వేయి హంసలర్పణ మగును.

6 ఆజ్ఞేయచక్రము భ్రూమధ్యమునందుండును. దీని అధిదేవత శివుడు సకలజీవులకు పూర్వ కర్మానుసారముగ సంకల్ప వికల్పంబులు కలిగించును. ఇచ్చట (1000) వేయి హంసలు అర్పణమగును.

7 సహస్రార చక్రము శిరోమధ్యభాగమున నుండును; దీని అధిదేవత గురుమూర్తియగు అక్షరపురుషుడు అధిష్ఠాన దేవతలకు సకలజీవులకు సాక్షిమాత్రముగా నుండి కర్మానుభవములను తెలియచేయును.

38 ప్రశ్న॥ హంసయనగానేమి ? అర్పణయనగా నెట్లు?

ఉ॥ ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా చలించే ప్రాణవాయువు నందుండునట్టి పరమాత్మ యొక్క కళనే హంసయని చెప్పబడును ఈదళములకు సోకుటే అర్పణయనబడును.

39 ప్రశ్న॥ హృదయమునందలి ప్రాణవాయువాధార చక్రాదుల నెట్లుసోకును !

ఉ॥ హృదయస్థానమునందు ప్రాణవాయువునకు గుదస్థానమునందునుండు నపానవాయువునకు వ్యానవాయువుద్వారా సంబంధముగలదు అందువల్ల అంతర ఇడాపింగళలద్వారా హృదయమునందున్న ప్రాణవాయు వపానవాయువు నాడీమార్గమున దిగి దళమునకు తాకును.

40 ప్రశ్న॥ హంశసృష్టికి స్థానమేది ?

ఉ॥ పరమాత్మ కళయగు హకారంబును ప్రకృతి కళయగు సకారంబును బిందువుతోజేరి హంసయని పరమహంసయని

శింశుమారమని పరమేశ్వరుడని నామాంతరములు బొందెను హంస సృష్టికి బిందువే స్థానమని తెలియవలెను.

41 ప్రశ్న॥ హంసలెన్ని అవి యేశరీర సంబాధములు!

ఉ॥ హంస ( 21600 ) అరువదియొక్క-వేయి యాఱునం దలు. ఇవిస్థూల శరీర సబంధములు.

42 ప్రశ్న॥ సూక్ష్మకారణ శరీరములకు హంసలు గలవా !

ఉ॥ హంసలు లేనియడల తనువులకు సంచారములేదు గనక సూక్ష్మకారణ శరీరములకు ( 3400 ) మూడువేల నాలుగు వందల హంసలుగలవు; వీనిని జీవేశ్వర హంసలని చెప్పబడును

43 ప్రశ్న॥ జీవేశ్వర హంసనెచ్చట సృష్టింప బడెను !

ఉ। జీవేశ్వరహంనలు బ్రహ్మాండమందు శింశుమార చక్రము న సృష్టింపబడినవి; కావున నీ హంసలు బ్రహ్మాండ సంబంధ మని చెప్పబడును.

44 ప్రశ్న॥ మానవమాత్రుడైన తాను పరమేశ్వర హంసల్లెట్లు తెలిసికొనెను ?

ఉ॥ తుర్యాతీత స్థానమందున్న మూలప్రకృతిరూపమగు విరా ట్పురుషునిలో కలిసి పరమేశ్వర హంసలు తెలిసికొనెను విరా డ్రూప లక్ష్యస్వరూపుడై లక్షించెను.

45 ప్రశ్న॥ విరాడ్రూప లక్ష్యమందు హంసనిర్ణయము నకునెట్లు సంకల్పించెను ?

ఉ॥ విరాడూ్రప లక్షార్థమందు హకార సకార బిందుయుక్త ముగానున్న పరతత్వమునుండి నాదుబిందు కళారూపము తెలియును. అది సమష్టిమనస్సుద్వార సంకల్పరూపమున హంస నిర్ణయము తెలిసికొనును.

46 ప్రశ్న॥ విరాడూ్రపమునందలి పరమహంస పిండాండమున నెట్లు తెలియును ?

ఉ॥ పరమహంస రవి. చంద్రాగ్ని మండలములద్వార పిండాండమునకు శిఖాపశ్చిమ మార్గముద్వార వచ్చి హకారరూపమున గంగయందును సకారరూపమున యమునయందును బిందురూపముగు సరస్వతితో జేరి హంసయై సహస్రారమందు ప్రవేశించి ఆధారాది చక్రముల పర్యంతరము వ్యాపించియుండును మఱియు నాదు బిందువులకు సానమైన కళ ఆధారంబు నువదలి ( హంక్షం ) అను వర్ణము గూడి బాహ్యానుషుమ్నల అంతరసుషుమ్నలను దాటిగుహామధ్య ప్రదేశంబైన ప్రాణాధిసహస్రారమునందు జేరి యున్నది గనుక పిండ బ్రహ్మాండ హంసలు పిండాండమునందు తెలియును కావున పిండాండమందలి జీవుడు పరమహంసయనియు ప్రత్యగాత్ముడనియు సూత్రాత్మయనియు పరమాత్ముడనియు చెప్పబడును.

47 ప్రశ్న॥ జీవేశ్వరనిర్మితములగుహంసలెచ్చటయెన్ని అర్పితము లగును ?

| | | | |
|---|---|---|---|
| ఉ॥ సూక్ష్మతనువునకు | ... | ... | 2200 |
| కారణ దేహమునకు | ... | ... | 1200 |

మొత్తము 3400 హంసలు దిగువరీతిగా అర్పణమగును.

| | | |
|---|---|---|
| 1 కర్మయానమగు ఋతువులకు — | 600 | యివిసూక్ష్మదేహ సంబంధములు |
| 2 పితృయానమగుచంద్రిమండలమునకు | 1600 | |
| 3 దేవయానమగు ఆదిత్యమండలమునకు ... | 1200 | |

యివి కారదేహమునకు.

48 ప్రశ్న॥ సూక్ష్మదేహ హంసలెచ్చట అర్పణమగును ?

ఉ॥ కర్మయానము మేగమండలమువరకు యున్నందున ఋతువులననుసరించి ఋతువొక్కంటికి ( 100 ) వందచొప్పున ఆరు రుతువులకు ( 600 ) ఆరువందల హంసలు అర్పణమగును.

2 పితృయాణము చంద్రిమండలము వరకు యున్నందున చంద్రికళల ననుసరించి కళవొక్కంటికి ( 100 ) వంద చొప్పున ( 16 ) పదహారుకళలకు ( 1600 ) పదహారు వందల హంసలు అర్పణమగును. గనుక సూక్ష్మదేహ హంసలు ( 2200 ) రెండువేల రెండువందలని నిర్ణయము.

3 దేవయానము ఆదిత్యమండలమువకు యున్నందున సూర్యకళల ననుసరించి కళయొక్కంటికి ( 100 ) వంద చొప్పున ద్వాదశ కళలకు ( 1200 ) పన్నెండువందల హంసలు అర్పణమగును; దీనినే ఈశ్వతనువని కారణ తనువని చెప్పబడును.

49 ప్రశ్న॥ తనుత్రియమునందు అర్పణమగు హంస లెన్ని ?

ఉ॥ స్థూల తనువునకు ( 21600 ) యిరువదియొక్క వేయిఆరు వందలు.

సూక్ష్మ శరీరమునకు కర్మయాన, పితృయానమునందు ( 2200 ) యిరువదిరెండువందలు.

ఈశ్వర శరీరమగు కారణశరీరమునకు దేవయానమునందు ( 1200 పన్నెండువందలు ) మొత్తం ( 25000 )యిరువది ఐదువేల హంసలు

ఈ యిరువది ఐదువేల హంసలు లయమగు వారలకే జన్మరహితమగును ఇతరులకు కాజాలదని ముముక్షువులకు సిద్ధాంతము.

50 ప్రశ్న॥ తనువులు నశించినప్పుడు హంసలెచ్చటనుండును ? నసియెప్పుడు నశించును ?

ఉ॥ స్థూలశరీరము నశించగా దానిసంబంధమగు ( 21600 ) యిరువదియొక్క వేయి ఆరువందల హంసలు ప్రకృతియందు జేరియుండును.

సూక్ష్మతనువు నశించుటకు కారణతనువు నశించనిది సూక్ష్మము నశించదు గనుక కారణతనువు నశించుటకు ఆత్మానాత్మవిచారణ చేసి అనాత్మనిర్ణయము లేక అంతఃకరణ అధిష్టానమైన చైతన్యమగు పరమాత్మయందు జేరి యెవ్వడు విదేహుడగునో వానికి కారణతనువు నశించును అందువల్ల సూక్ష్మశరీరము నిలుకడకు చోటులేక తనంతట తానే నశించును.

శింశుమార చక్రమునుండి పిండాండమునందు ప్రవేశించిన హంసలు తిరిగి శింశుమార చక్రమునందు జేరును.

51 ప్రశ్న॥ బ్రహ్మాండమునందలిఅధిదేవతలు పిండాండమునందెట్లు ప్రవర్తించెదరు ?

ఉ॥ పిండాండమందలి యింద్రియ సముదాయము అనగా జ్ఞాన మనో బుద్ధి చిత్తాహంకారమును అంతరేంద్రియములు సమాన. వ్యాన. ఉదాన. ప్రాణ. అపానంబులను ప్రాణేంద్రియంబులు, శ్రోత్రము. త్వక్కు. చక్షువు. జిహ్వా. ఘ్రాణమను జ్ఞానేంద్రియంబులును, శబ్ద. స్పర్శ. రూప. రస. గంధములను విషయేంద్రియంబులును, వాక్కు. పాణి. పాద. గుహ్యా. గుదములను కర్మేంద్రియంబులు. వెరశి ( 25 ) యిరువదిఐదు యింద్రియములు అధ్యాత్మలని చెప్పబడును. వీని విషయంబులు అధిభౌతికము లనబడును. వీని నిర్మితములగు దేవతలు ఆదిదైవములని చెప్పబడును ఆది దైవతములయొక్క ప్రేరేపణచేతనే పిండాండ రూపమగు వ్యవహారము జరుగుచున్నది కనుక పిండాండ ప్రవర్తనకు బ్రహ్మాండమునందలి అధిదేవతలే కర్తలుగా తెలియవలెను.

52 ప్రశ్న॥ అష్టదళపద్మమునందలి హంసకు గుణకల్పనయెట్లుకలుగును ?

ఉ॥ బ్రహ్మాండరూపమగు ఈశ్వరతనువు అనగా

1 అవ్యక్తదళము ఈశాన్యముఖముగా నుండును; హంససత్తా దీనియందు సోకగనే దానక్రియ నొనరించవలయుననే గుణముకలుగును దీనిని అరికట్టకూడదు.

2 మహాత్తుదళము ఉత్తరదిశయందు ముఖము గలిగియుండును దీనియందు హంస సత్తా సోకగనే రతి ప్రీతి

కరమైన గుణముకలుగును మేనిహంసలు నిలిపి నడినాళ మందలి పవనమున ఐక్యము చేయగా నీగుణము నసించును.

3 మహదహంకార రూపదళము వాయవ్యముఖముగా దీనిపైన హంససత్తా సోకగనే గమనచింత కలుగును. విషయగమనాదులు విడిచి అంతర సుషుమ్న మార్గమున పరబ్రహ్మ గమనము తెలియవలెను॥

4 పంచతన్మాత్రి రూపమగు ఆకాశదళము పశ్చిమ దిశగానుండును దీనిపైన హంససత్తా సోకగనే ఆటపాటలతో ఆనందమునెందవలయునని ఆసక్తికలుగునుబ్రహ్మానందము మోక్షదాయకమని తెలిసి జీవేశ్వరైక్యమునందు అశక్తికలిగి యుండవలెను.

పిండాండ రూపమగు జీవతను నిర్ణయము

5 వాయువుయొక్క రూపమగు దళము నైరుతిదిశగానుండును దీనిపైన హంసయొక్కసత్తా సోకగనే పాపపు పనులు చేయవలెననే కోరిక కలుగును సమాధి పద్ధతులచే దీనిని అరికట్టవలయును.

6 అగ్నియొక్క రూపమగు దక్షిణదళము దక్షిణదిశగానుండును దీనిపైన హంసయొక్క సత్తాసోకగనే క్రూరమైన కార్యములు చేయవలెననే కోరికగలుగును దీనిని శాంభవీ ముద్రిచేత అరికట్టవలెను.

7 జలరూపమగు దళము అగ్నేయ దిశగానుండును దీని

పైన హంసయొక్క సత్త్వాపోశగనే తమోగుణ ప్రధాన మగు నిద్రాలశ్యములు కలుగును. దీనిని ఆసనాది క్రియలచే అరికట్టవలెను.

3 పృధ్వీరూపమగుదళము పూర్వదిశగా నుండును దీని పైన హంససత్త్వాపోశగనే పుణ్యకార్యము చేయవలెననే కోరిక జనించును. దీనిని అరికట్టక స్వార్ధరహితముగా ప్రవర్తించవలయును.

## -[ అష్టతను నిర్ణయము. ]-

అవ్యక్తము, మహత్తు, మహదహంకారము. పంచ తన్మాత్ర రూపమగు ఆకాశమును, నివి ఈశ్వరతను చతుష్టయములు, వాయువు, అగ్ని, జలము. పృధ్వీయనునవి జీవితను చతుష్టయములు. ఈ చతుష్టతను వ్యవహార నిరసనమే పరమహంస నిర్ణయ పరబ్రహ్మము.

59 ప్రశ్న పరబ్రహ్మమగు అచలహంస యెట్లు చలించును ?

ఉ॥ సూర్యరశ్మి వృక్షాదులపైన బడును; కాని వాయువుయొక్క ప్రసరణవల్ల ఆకులు కొమ్మలుకదులును వానితో సముముగా సూర్యరశ్మి కదలినట్లు తెలియును కాని అది కదలదు అదేవిధముగా కర్మానుసారముగా దళములు కదలిన దానితోబాటు పరబ్రహ్మమగు అచలహంస కదలినట్లు లగుపడును కాని పరమహంస కదలదు.

54 ప్రశ్న॥ నీటిఆధారముగల పద్మములు సూర్యరస్మిచేత పోషింపబడును. నీటిఆధారములులేని పద్మములు ఆరస్మిచేతనే నశింపబడును; కనుక అష్టదళ పద్మమునకు నీటి ఆధారమేది ?
ఉ॥ గంగా. యమునా. సరస్వతులను త్రివేణి సంగమున అష్టదళ పద్మముండును. అది పరబ్రహ్మ ప్రకాశమగు పరమహంస వలన రక్షింపబడును. ఆగామి సంచిత. ప్రారబ్ధ రూపకర్మలు త్రివేణులుగా ప్రవహించును. వాని నింకింప జేసిన వారిపద్మము దహించును. అందువల్ల కర్మరహితమై మోక్షము చేకూరును.

55 ప్రశ్న॥ ఆగామి. సంచిత. ప్రారబ్ధ నిర్ణయమెట్లు?
ఉ॥ జన్మాదినుండి జీవుడు చేసినకర్మ కాలానుగుణ్యముగ నుపాధులయందు ననుసరించును అది సంచిత కర్మయనబడును. ఉపాధులయందు ననుభవించునది ప్రారబ్ధ మనబడును అనుభవించన దానినుండివచ్చిన ఫలాఫలంబు లాగామియనబడును.

56 ప్రశ్న॥ జీవుడుచేయు కర్మయొక్క ఫలాఫలంబు లెచ్చట చేరియుండును ?
ఉ॥ పంచభూత సంబంధమైన జీవుడు పంచీకృత పంచభూత సముదాయముతో జేసిన కర్మయొక్క ఫలాఫలంబులు పంచ చక్రములయందు అనగా పంచభూత సంబధమగు అధారాది పంచచక్రములయందు జేరియుండును.

57 ప్రశ్న. ఆధారాది చక్రంబులు చలించునా చలనరహితముగానుండునా ? అవి ఏముఖముగా నుండును ?
ఉ॥ ఆధారాది చక్రంబులకు సంబంధించిన నాడులవలన కట్టి

వశియుండును ఘ్రాణసముదాయ సృష్టి అధోగమనము గనుక దాని సంబంధమైన చక్రంబు అధోముఖముగానే యుండును

63 ప్రశ్న॥ కర్మానుభవములు చక్రంబులకెట్లు జేరును?

1 జీవుడు జ్ఞానము. సమానవాయువు. శ్రోత్రము. శబ్దము. వాక్కు. ఈ యైదింటిలో జేరి జీవుడు చేసిన కర్మ ఫలంబులు పంచనాడుల ద్వార ఆకాశ సంబంధమగు విశుద్ధ చక్రములోకి జేరును.

2 మనస్సు. వ్యానవాయువు. చర్మము. స్పర్శ. పాణి. ఈ యైదింటితో జేరి జీవుడుచేసిన కర్మఫలంబులు వీనికి సంబంధించిన నాడుల ద్వార వాయు సంబంధమగు అనాహత చక్రమునందు జేరును.

3 బుద్ధి. ఉదానము. నేత్రము. రూపము. చరణము. ఈ యైదింటిలో జేరి జీవుడుచేసిన కర్మఫలంబులు వీనికి సంబంధమగు నాడులద్వారదిగి అగ్నిసంబంధమగు మణిపూరకమందు జేరును.

4 చిత్తము. ప్రాణవాయువు. జిహ్వ. రసము. గుహ్యము. ఈ యైదింటిలో జేరి జీవుడుచేయు కర్మఫలంబులు వీనికి సంబంధమగు నాడులమార్గముగాదిగి జలసంబంధమగు స్వాధిష్ఠాన చక్రమునందు జేరును.

5 అహంకారము. అపానము ఘ్రాణము. గంధము. గుదము ఈ యైదింటిలోకి జీవుడుచేరిచేయు కర్మఫలంబులువీనికిసంబంధించిన నాడులద్వారదిగి ఆధార చక్రమునందు జేరును.

59 ప్రశ్న॥ ఆగామి. సంచిత. ప్రారబ్ధంబులకు స్థానములెచ్చట ?

ఉ॥ సంచితకర్మ జీవేశ్వరతనువుకు దిగువ త్రివేణి సంగమమ ననుండును. అనుభవించునది ప్రారబ్ధము సంచితమునందే గనక ప్రారబ్ధకర్మమునకు వేరుగా స్థాననిర్ణయము లేదు. దీనికి సంచిత కర్మస్థానమైయుండును. జీవుడు తన శరీరము విడుచునపుడు అగామిచేరుటకు సంచితకర్మ స్థానమేగనుక అగామికి వేరుస్థానము లేక సంచితమనే చెప్పవలయును; కాని వ్యవహారమునందు ఫలాఫలంబుల నిల్వలు వేరుగానుండుటచే ఆగామి స్థానంబులు వేరుగా చెప్పవలసివచ్చెను.

60 ప్రశ్న॥ మరణ సమయమున ఆగామికర్మ. సంచిత కర్మమునకు నెట్లు జేరును ?

ఉ॥ కర్మానుసారముగ నుపాదిరహితమునందు భౌతిక హంస లుక్షీణించును. అందువల్ల దేహమునందలి నాడుల బలముతగ్గను. అందువల్ల చక్రములు అదోముఖముగా నున్నవియూర్ధ్వముఖమునకు తిరుగును. అందువల్ల ఆగామికర్మ యూర్ధ్వముగానున్న సంచితకర్మలోచేరి సంచితరూపము బొందును.

61 ప్రశ్న॥ సంచితరూపకర్మ జీవుడు ప్రారబ్ధరూపమునెట్లు అనుభవించును ?

ఉ॥ తనువుల మధ్యలోనున్న సంచితకర్మ అధోముఖ రూపమున ఘంటికయందుబడి దానినుండి అధోరూపముననున్న నాడులద్వార శరీరములయందు వ్యాపించి ప్రారబ్ధరూపమున

కష్టసుఖములఁబొందు చుండును. స్థానవద్ధతుల ననుసరించి స్థావర జంగమాత్మక మగు జీవోపాదుల పొందును

62 ప్రశ్న॥ ప్రణవరూపమగు ఓంకారమెచ్చట సృష్టింపబడెను?

ఉ॥ పరమహంసయను ఆత్మ పరమాత్మలయొక్క మధ్యభాగమునందు ధ్వన్యాత్మకమగు శబ్దము పుట్టెను. హంసయగు ప్రాణ మనంబుల మధ్యభాగమునందు వర్ణాత్మకమగు బీజములు జనించెను. అట్టి అకార ఉకార మకార ములయొక్క చేరికవల్ల ఓంకారమని ప్రణవోచ్చారమని చెప్పబడును.

63 ప్రశ్న॥ పరమాత్మ స్థానమందు ప్రణవరూపమగు ఓంకారము. ఏ స్వరూపముగా నుండును ?

ఉ॥ అష్టవిధ తనువులు. చతుర్విధ పాథంబులు. త్రివిధ స్థానంబులు పంచవిధ అధిదేవతలుగా నుండును.

64 ప్రశ్న॥ అష్టవిధ తనువులేవి ?

ఉ॥ స్థూల. సూక్ష్మ. కారణ. నిర్మలములనేడి కార్యతనువులు. ఈ నాలుగు జీవతనువులు ఆనంద. చిన్మయ. చిద్రూప. శుద్ధము. యనెడి కారణతనవులు నాలుగీశ్వరతనువులు.

65 ప్రశ్న॥ అష్టతనువుల నివాసమునకు స్థానమేది ?

ఉ॥ ప్రాణమనంబుల మద్యప్రదేశమున ప్రణవరూపమైన ఓంకారోత్పత్తిగనుక ప్రాణరూపమగు హంస నివాసమునకు ఏస్థానమో ప్రణవరూపమగు ఓంకార నివాసమునకు అదేస్థానము కాని హంస వ్యవహారము సూక్ష్మము. ప్రణవరూపమగు ఓంకార వ్యవహారము స్థూలమని నిర్ణయము.

66 ప్రశ్న॥ ప్రణవమునకు నాలుగుపాదములేవి? వాని స్థానములెచ్చట ?

ఉ॥ అవిద్యాపాదము. విద్యాపాదము. ఆనందపాదము. తురీయపాదములని నాలుగు. అవిద్యాపాదము కేసరముగాను విద్యాపాదము కర్ణికముగాను. అనందపాదము. లింగము గాను. తురీయపాదము పద్మత్యాగముగాను నిర్ణయము.

57 ప్రశ్న॥ ప్రణవపాదంబుల వ్యవహారమెట్లు జరుగును?

ఉ॥ అవిద్యాపాదంబులు జాగ్రావస్థ శ్రవణ కాలంబుగాను; విద్యాపాదము. స్వప్నావస్థ మనన కాలముగాను; ఆనంద పాథము. సుషుప్త్యావస్థనిధిద్యాసగాను. తురీయపాదము బ్రహ్మా నుభవముగాను నిర్ణయము.

68 ప్రశ్న॥ ప్రణవమునకు త్రివిధస్థానములేవి ?

ఉ॥ అకారము ఈశ్వరస్థానము. ఉకారము జీవస్థానము. మకారరూపము ప్రత్యగాత్మ స్థానమని నిర్ణయము.

69 ప్రశ్న॥ ప్రణవమునకున్న పంచదేవతలెవ్వరు ?

ఉ॥ బ్రహ్మ. విష్ణు. రుద్రుడు. ఈశ్వరుడు. సదాశివుడు. అను వారలు పంచదేవతలని చెప్పబడుదురు.

70 ప్రశ్న॥ ప్రణవసత్తావల్ల వంచదేవతలనిర్ణయమా! దేవతలవలన ప్రణవనిర్ణయమా ?

ఉ॥ ప్రణవసత్తావల్లనే పంచదేవతల నిర్ణయముగాని పంచదే వతలవల్ల ప్రణవనిర్ణయముకాదు పరమాత్మవల్ల ప్రణవ నిర్ణ యమని తెలియ నగును,

71 ప్రశ్న॥ పరమాత్మ రూపమగు ప్రణవమునకు యెన్నికళలు యుండును ?

ఉ॥ పరా. పశ్యంతి. మధ్యమ. వైఖరి, యనునాలుగు పద్ధతులు జాగ్రిత్త, స్వప్నము. సుషుప్తి, తురీయములని చెప్పబడును. వీనియందు జాగ్రిత్తలో స్వప్నము జాగ్రత్తలో సుషుప్తి జాగ్రితలో తురీయమని స్వప్నములో జాగ్రత స్వప్నములోసుషుప్తి. స్వప్నములో తురీయమని. సుషుప్తిలో జాగ్రిత్త. సుషుప్తిలో స్వప్నము. సుషుప్తిలో తురీయమని తురీయ్యములో జాగ్రిత్త తురీయములో స్వప్నము తురీయములో సుషుప్తియని, పదియాఱుకళలుగానుండును.

72 ప్రశ్న॥ షోడశ కళలలో పారమార్థిక కళలెన్ని. ప్రపంచకళలెన్ని ?

ఉ॥ తురీయము. తురీయములో జాగ్రిత. తురీయములో స్వప్నము. తురీయములో సుషుప్తి యీనాలుగు. పారమార్థికములు; మిగిత పన్నెండు లోకకళలు.

73 ప్రశ్న॥ ప్రళయము యొక్క పరిణామ స్వరూపములు లేవి ?

ఉ॥ నమశ్శివాయను బీజంబులు. క్రియ. ఇచ్ఛ. జ్ఞాన. ఆదిపరా. వీని వ్యవహారమునకు ఆధారభూతములులగు పంచప్రాణంబులుగా పరిణామము బొందెను. ఇందు నమయనునది సగుణము. శివాయ యనునది నిర్గుణముగానుండును మఱియు నమయనునది జీవుడుగాను. శివాయయనునది ఈశ్వరుడుగాను

ఓమ్మనునది జీవేశ్వరులకు ఐక్యముగానుండును దీనినే తత్వమ
శియసియు. తత్పదము. త్వంపదము, అశిపదమని చెప్పబడును.

74 ప్రశ్న॥ పరమేశ్వరుని అర్ధాంగియగు ప్రకృతి రూపు ఆదిశక్తియందు పంచబీజంబులే రీతిగానుండును ?

ఉ॥ ఓంకారముఖము, వాయాకారములు రెండు భుజములు. శివయనునది కంటిభాగము. నమయనునవి రెండు పాదంబులుగానుండును కనుక ఇది ఆదిశక్తియొక్క అకారమని నిర్ణయము.

75 ప్రశ్న. ప్రణవ పరిణామమగు పంచాక్షరములవల్ల ఏకార్యములు జర్గును ?

ఉ॥ స్థావర జంగమాత్మకమైన జీవోపాదులు ఉత్పత్తి. స్థితి, లయ. విసర్గ. ఆకర్షణంబులు చేయుటకు మరియు మారణ. మోహన. స్థంబన. ఆకర్షణ. ఉచ్చారన చేయుటకు ఆధారముగానుండును.

76 ప్రశ్న॥ జాగ్రదావస్థ యందలి ప్రణవము తుకీయ స్థానము బొందినట్లు అనుభమేది ?

ఉ॥ అకార. ఉకార. మకారములగు మాత్రిత్రియము. వైఖరి మద్యమ. పశ్యంతియను వాకుÌలయందు చేర్చి పరావాగ్రూపముగా ప్రణవధ్యాహ్నముచేయగా అవస్థాత్రియరహితమగు తురీయమందు చేరును అప్పటిలో నుత్తరాయణ. దక్షిణాయణములు. రాత్రి పగలనె వ్యవహారము లేక కేవలపరబ్రహ్మ నిర్ణయముగా స్వయంప్రకాశము గలిగియుండును ఇది స్వానుభవము.

77 ప్రశ్న॥ ప్రణవ మెచ్చట నేవ్యవహారము చేయును?
ఉ॥ ప్రణవము. పద్మమధ్యంబున. అకార. ఉకార, మకారము లుగానుండును. ఆజ్ఞేయంబున నాదుబిందుకళలుగావర్తించును. ఘంటికయందు. చిన్నాద, చిద్బిందు. చిత్కళలుగా ప్రబలును గంటికయందు ప్రాణవాయువుతో కలియగ ప్రణవంబునకు శబ్దము కలిగెను.

78 ప్రశ్న॥ హృదయమునందలి ప్రాణవాయువుకు గంటికయందలి ప్రణవమునకు సంబంధ మెట్లు కలిగెను ?
ఉ॥ అంతర, ఇడా పింగళనాడులు బ్రహ్మదండికి కుడి యెడమ గుండ నుండి హృదయమువరకు వ్యాపించి ప్రాణవాయువు ద్వార ఘంటికయందు జేరి బాహ్యమునకు ప్రసరించును గనుక ఘంటికయందలి ప్రణవమునకు ప్రాణవాయువుతో సంబంధము కలిగెను.

79 ప్రశ్న॥ గంటికయందలి ప్రణవమునకు శబ్దము గలదా లేవా ?
ఉ॥ గంటిక సూక్ష్మశరీర సంబంధము గనుక దానియందలి ప్రణవమునకు ధ్వన్యాత్మకమగు శబ్దముగలదు. ప్రాణవాయువుతో సబంధపడినప్పుడు వర్ణాత్మకమగు శబ్దము కలిగెను, అందువల్ల స్థూలనాథమగు వైఖరి స్థూలరూపమగు బిందువు, స్థూలరూపమగు కళ తెలియును గనుక ఘంటిక యందలి ప్రణవము ఊర్ధ్వముఖముగా నున్నప్పుడు నిర్గుణ ప్రణవమని. అధోముఖముగా నున్నప్పుడు సగుణప్రణవమని చెప్పబడును.

80 ప్రశ్న॥ సగుణప్రణవము వినువారికి వేణునాద వినోదులనిపేరు యెట్లుగలిగెను ?

ఉ॥ సుషుమ్నయను పిల్లనగ్రోవిలో కుంభకమను ప్రాణము పూరించగా పంచ చక్రములను రంధ్రములద్వార వేణు నాదము బయలుదేరును అట్టి నాదానందము జెందువారిని వేణునాద వినోదులని చెప్పబడును.

81 ప్రశ్న॥ ప్రణవమునకు పాదచతుష్టయమేది? అది యుండుస్థానమేది ?

ఉ॥ అకార. ఉకార. మకార. అర్ధమాత్రలనునవి పాదచతుష్టయము. అర్ధమాత్రక పరమాత్మ యందుండును. మకారము కమలమధ్యమున. ఉకారము ఆజ్ఞేయమున. అకారము త్రికుటి కయందును. ఇవియే స్థూల. సూక్ష్మ. కారణ. మహాకారణ ప్రణవంబులుగా చెప్పబడును.

82 ప్రశ్న॥ ఆజ్ఞేయమునకు. ద్విదళస్థానమని. ఇంద్ర యోనియని వ్యవహార పంచకస్థానమని ఓంకార గృహమని. సిద్ధయోనియని. పేర్లెట్లువచ్చెను ?

ఉ॥ చిచ్ఛక్తి కమలమునుండి దిగి ద్విదళస్థానమగు ఆజ్ఞేయము నకు వచ్చి కార్యకర్తలగు అధిదేవతలకు కార్యానుకూలమగు నాజ్ఞయొసంగు స్థానముగనుక ఆజ్ఞేయమని చెప్పబడును.

2 నీవు నేనని సంకల్ప వికల్పములుగా వ్యవహారించు హంసమంత్రమను రెండు దళంబుల యందుండి జీవసృష్టి విధా నముజర్గుచున్నది గనుక ఆజ్ఞేయమునకు ద్విదళస్థానమని పేరు కలిగెను.

3 ఇంద్రియములు చేయు వ్యవహారమ్ములు సరిచూచు స్థానము గనుక ఆజ్ఞేయమునకు వ్యవహార స్థానమని పేరుకలిగెను.

4 పంచశక్తులకు మూలస్థాన మగుటచేత ఇంద్రియోని యని చెప్పబడును.

5 ప్రణవము అచ్చటనుండి నాద బిందు. కళారూపమున అహోరాత్రింబులు ప్రణవధ్వని ఘోషించుటచే ఓంకార గృహమని చెప్పబడును.

6 ఈ స్థానము చెరినవారు సిద్ధ పురుషులగుటచే దీనిని సిద్ధయోనియని చెప్పబడును.

83 ప్రశ్న॥ దళములు కదిలినందున కర్మజరుగుచున్నవి; కర్మవల్ల పాపపుణ్యములు జనించుచున్నవి; వీని ననుభవించేవారెవ్వరు ?

ఉ॥ దళములపైన పరమాత్మ ప్రకాశము సోకుచున్నది;అందువల్ల దళముల చాయ దళముల దిగువ పడుచున్నది. ఆచాయనే జీవుడని చెప్పబడును. ఇట్టిజీవుడు అధోముఖ వ్యాపకమునందు అధ్యాత్మ, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖముల ననుభవించుచు జనన మరణముల బొందుచుండును. గనుక జీవుడు కర్మానుభవము బొందును.

84 ప్రశ్న॥ జీవునకు ముక్తియెట్లు చేకూరును ?

ఉ॥ ఆత్మానాత్మ వివేకము వలన జీవునకు ముక్తి చేకూరును

85 ప్రశ్న॥ ఆత్మానాత్మ వివేకమెట్లు గల్గును ?

ఉ॥ పూర్వజన్మ పుణ్యవశమున ఆత్మానాత్మ వివేకముగల్గును అందువలన ఆత్మానాత్మ నిర్ణయము తెలియును

86 ప్రశ్న॥ ఆత్మానాత్మ వివేకమెట్లు తెలియును ?

ఉ॥ ప్రణవపాద చతుష్టయమందలి అర్ధమాత్రను దెలిసి రేచక పూరకరూపములగు స్థూలహంసల ద్వార అజ్ఞాచక్రమందు దూరి గంటికద్వార కమలమందు ప్రవేశించి కమలమును త్యజించి పరబ్రహ్మమున నైక్యముగావలయును. ఈ పద్ధతివలన ఆత్మానాత్మ నిర్ణయము తెలియును. అందువలన సకలవ్యవహారములు సూన్యమగును.

1 హకారరూపుడైన తాను సకారరూపమగు ప్రకృతిని జేరక నేనను రెండక్షరముల మధ్యనగల పొల్లునజేరి తాను పొల్లయి గంటికయందలి బిందువును లక్షింపగా వ్యవహార కారణమగు హంసరెక్కలు విరుగును అందుచే బాహ్యవ్యవహార శూన్యమై జీవహంస లేకపోవును.

2 హకారరూపుడును తాను ఈశ్వర ప్రకృతి రూపమగు సకారములో జేరక మధ్యనున్న బిందువునజేరి దళముల యందలి పరబ్రహ్మ ప్రకాశము లక్షింపగా నడకకు కారణమగు హంస పాదములు తెగిపోవును. అందువలన కలహంసయను నామము నశించును.

3 హకారరూపుడగు తాను పరమాత్మ ప్రకాశములో అనగా త్రిగుణసామ్య ప్రకృతిలో జేరక బిందురూప